బొమ్మల

# చంద్రశేఖర ఆజాద్

(1906 - 1931)

మలయశ్రీ

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్, * విజయవాడ-520002

# మా స్వంత ప్రచురణలు

బొమ్మల శ్రీ షిర్డీసాయి జీవిత చరిత్ర
" అక్బర్ బీర్బల్ వినోద కథలు
" తెనాలి రామకృష్ణుని సంపూర్ణ హాస్య కథలు
" ఆలీబాబా 40 దొంగలు
" అల్లావుద్దీన్ అద్భుతదీపం
" గలివర్ సాహస యాత్రలు
" శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
" భట్టి విక్రమార్కుని సాహస కథలు (2 భాగాలు)
" భేతాళ కథలు
" మొగల్ సామ్రాజ్య కథానాయకులు
" ప్రవక్త మహమ్మద్
" ఏసుక్రీస్తు కథలు
" మథర్ థెరిసా
" రవీంద్రనాధ్ ఠాకూర్
" యోగివేమన
" భగత్ సింగ్
" అంబేద్కర్
" యశపాల్ కపూర్
" భగవతీచరణ్
" సుభాస్‌చంద్రబోస్
" చంద్రశేఖర ఆజాద్
" జయప్రకాష్ నారాయణ్
" సంఘసంస్కర్త రాజారామమోహనరాయ్
" పూజ్యబాపూజీ

బొమ్మల పంచతంత్రం (2 భాగాలు)
" రామాయణం
" భారతం
" భాగవతం
" దశావతారాలు
" శ్రీకృష్ణలీలలు
" పరమానందయ్యశిష్యులు
" శ్రీ వెంకటేశ్వరలీలలు
" శ్రీ అయ్యప్పలీలలు
" శ్రీరామపట్టాభిషేకం
" జై వీర హనుమాన్
" పల్నాటివీరచరిత్ర
" బాలనాగమ్మ
" శ్రీ కాళహస్తిమహాత్మ్యం
" శ్రీశైలక్షేత్ర మహాత్మ్యం
" శ్రీ సింహాచలక్షేత్రము
" శ్రీ యాదగిరి నరసింహస్వామి చరిత్ర
" శ్రీ కాశీ రామేశ్వర మజిలీలకథలు
" కోటప్పకొండ చరిత్ర
" శ్రీ వినాయక విజయము
" శ్రీ భద్రాచల మహాత్మ్యం
" శ్రీ పాండురంగలీలలు
" శ్రీ రాఘవేంద్రలీలలు
" కనకదుర్గ మహాత్మ్యం
" శివలీలలు



ఎందరో మహానుభావులు !

ఈ స్వాతంత్ర్యం వారు పెట్టిన భిక్ష. ఎందరెందరి త్యాగాల ఫలితం గానో మన దేశానికి 15 ఆగష్టు, 1947 నాడు స్వాతంత్ర్యం లభించింది. అప్పుడే 40 ఏండ్లు కావస్తున్నది. అలనాటి భారత విముక్తి పోరాట చరిత్ర ఒళ్ళును గగుర్పాటు కలిగించేది.

శాంతివాదులేకాదు క్రాంతికారులుకూడా అనేకులు సాహసంతో స్వతంత్ర సమర యజ్ఞానికి సమిధలైనారు.

ఆనాటి చరిత్ర తెలిస్తేకాని ఇప్పటి స్వేచ్ఛకు అర్థం-విలువ తెలియవు.

ఇప్పటికీ మనదేశం మనం కోరుకునే అభివృద్ధిని సాధించలేదు. అసమానతలు, నిరుద్యోగం తొలగిపోలేదు. అంతటా అవినీతి నిండుకుంటున్నది. అయినా పరాయివారి పాలనా దాస్యంలో లేము. మనం స్వతంత్రులం. మన దేశాన్ని-జనాన్ని సరిదిద్దుకోవల్సిన వాళ్ళం మనం. అందుకు గత కాల చరిత్రను చదివి విజ్ఞానం పెంపొందించుకోవడం ఎంతో అవసరం.

జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ-అని సూక్తి.

జనని కంటే జన్మభూమిని ప్రాణప్రదంగా ప్రేమించి తన జీవితాన్ని దేశంకోసం అర్పించిన విప్లవ వీరశిఖామణి ఆజాద్ చంద్రశేఖర్ అద్భుత అమర చరిత్ర. ఇదో చదవండి!



# చంద్రశేఖర ఆజాద్

## జననం:

పండిత సీతారాం తివారీ, జగరాణీదేవి దంపతులకు తేది 23 జూలై 1906 నాడు జన్మించిన ముద్దుల కుమారుడే మన చంద్రశేఖర్. ముగ్గురు పిల్లలు పుట్టి పోగా నాలుగవవాడు అర్భకుడుకాగా. అయిదవవాడుగా అందంగా జన్మించిన ఈ బాబుకు ఆనందంగా చంద్రశేఖరుడని పేరు పెట్టుకున్నారు.





బాల్యంలో బక్కచిక్కి బలహీనంగానే ఉండేవాడీ బాలుడు. అయినా చందమామలాంటి అందమైన గుండ్రని కాంతిగల ముఖం, దబ్బపండులాంటి ఒంటిరంగుతో బంగారు బొమ్మలా ఆకర్షణీయంగా ఉండేవాడు, జింకపిల్లగా అమాయకంగా కనిపించే ఆ చిన్నారి పెరిగి సింహంకొదమగా మారుతాడని ఎవరు కలగన్నారు.

తన చిట్టిబాబుకు బలమైన ఆహారమైనా పెట్టగలిగిన స్థితిలో లేని తమ పేదరికానికి ఆ తల్లి ఎంతగానో కుమిలిపోయేది. కన్నీరు కార్చేది. తల్లి పాల తోనే క్రమంగా ఏపుగా పెరగసాగాడా బాబు. వాడ స్త్రీలందరూ అతనిని ప్రేమతో ఎత్తుకొని ఆడించేవారు.

## జననీ జనకులు-జన్మస్థలం

పండిత సీతారాం తివారీ పేద బ్రాహ్మడు. పెద్ద చదువులూ, పాండి త్యం లేకపోయినా పూజాపురస్కారాలు చేయగల-చేయించగల విద్యా పరిచయం కలవాడు. సనాతన ఆచారాలంటే తగని ప్రీతి, అతి నీతిపరుడు, ఆత్మాభిమానం కలవాడు, ధర్మాన్ని ఏనాడూ వదలుకోలేదు. ధనంలేకున్నా గుణంలేనివాడుమాత్రం కాదు.

ఉత్తర ప్రదేశ్‌లోని కాన్‌పూర్ జిల్లాలో వీరి పూర్వీకుల గ్రామం ఉండేది. తర్వాత 'ఉన్నావ్' బదరికా-గ్రామంలో కొన్నాళ్ళు కాలం గడిపాడు. బదరికాలోనే వివాహమైంది. ఇల్లరికపు అల్లుడు. అత్తింటివారు చులకనగా చూడటం అతడు సహించలేకపోయాడు. భార్యకూడా అనుకూలవతికాదు.

అందుకే ఆ సంబంధాన్ని కాదని వేరే పెళ్ళి చేసుకున్నాడు. ఆమె కొద్ది కాలానికే మరణించింది. నిరాశకు లోనుకాలేదు తివారి. యువకుడు సంపాదనాపరుడు కావటంవల్ల మూడవ పెళ్ళి చేసుకున్నాడు. ఆమే మన చంద్రశేఖర్‌ను కన్నతల్లి జగరాణీదేవి, ఆమె పుట్టినిల్లు 'చంద్రమన్ ఖేరా.'

'బదరికా'ను వదలి బతుకుతెరువుకోసం తిరుగుతూ వచ్చి 'అలీరాజపురం' దగ్గరి 'బాంవరా' గ్రామంలో స్థిరపడ్డాడు సీతారాం తివారి. అప్పుడు ఆ వూరు ఉత్తరప్రదేశ్‌లో ఉన్నా ఇప్పుడు మధ్యప్రదేశ్‌లో ఉంది.

అక్కడ అటవీశాఖలో ఒక చిన్న ఉద్యోగం లభించినా, ఆటవికులతో సరిపడక దాన్ని వదలివేశాడు. ఆవులు-గేదెలు పెంచుతూ పాల వ్యాపారం ఆరంభించాడు. అదీ కలిసిరాలేదు. బహు ప్రయాసతో ఒక తోటకాపరి ఉద్యోగం సంపాదించుకున్నాడు. జీతం పది రూపాయలు. అంతకే సంతసించి ఆ తోట దగ్గర గుడిసె వేసుకొని అక్కడే కుటుంబంతోపాటు జీవితం గడుపసాగాడు. కొడుకు సుఖదేవ్ (ఇతడు విప్లవకారుడుకాదు)తో పాటు ఉన్నంతలో గుట్టుగా సంసారం గడపసాగింది ఉత్తమ ఇల్లాలు జగరాణీదేవి.

తివారీ చేసేది తోటకాపరి పనే అయినా అతని నీతి నిష్ఠలు-ఉత్తమ ప్రవర్తన కారణంగా ఊరివారి మన్ననకు పాత్రుడై 'గ్రామ పెద్ద'గా ఎన్నుకోబడినాడు. అయినా ఆదాయం మాత్రం పెరగలేదు. అక్కడే జన్మించాడు చంద్రశేఖర్.

## బాల్యం :

బాంవరా గ్రామంచుట్టూ కొండలు పచ్చని చెట్లు చేమలు నిండి ఉండేవి. ఆ ప్రక్కనుంచే కొబ్బరిపాలవంటి తియ్యని నీటితో ఓ కొండవాగు పారుతుండేది. దాని పరిసరాలలో గిరిజనులు నివసించేవారు. ఆ పరిసరాలలో ఆటపాటల్తో చంద్ర శేఖర్ బాల్యం గడిచిపోయింది. అతడెప్పుడూ తన జట్టుకంటే ముందుండేవాడు. తల్లిదండ్రులకు అతడంటే తగనిప్రేమ.



తివారీకి కాస్త కోపం ఎక్కువ. అందుకే తల్లిదగ్గర అతనికి చను వెక్కువ. కొడుకు ఏదైనా అల్లరిపని చేసినప్పుడు 'నీ గారాబం వల్లనే పిల్లవాడు

చెడిపోతున్నాడు' అని కేకలేసేవాడు తివారీ. చంద్రశేఖర్ పరుగెత్తుకెళ్ళి తల్లి ఒడిలో గువ్వపిట్టలా ఒదిగిపోయేవాడు. ఆమె ప్రేమతో కొడుకు తల నిమురుతూ ఏదో విధంగా భర్తను శాంతపరచేది.

కొడుకులిద్దరినీ ఒక త్రివేదీగారింటికి చదువుకోసం పంపించేవాడు తివారీ. అప్పుడు ఇప్పటిలా ప్రభుత్వ పాఠశాలలు, పబ్లిక్‌స్కూళ్ళు లేకుండేవి. వెనుకటి కాలాలలో గురుకులాలలో, వనాలలో మునులు బాలురకు విద్య నేర్పించే వారు. ఈ కథా కాలంలో ఎవరో చదువుకున్నవారు తమకు వచ్చింది చేరవచ్చిన



పిల్లలకు నేర్పించేవారు. వాళ్ళు ఇచ్చిన డబ్బు-ధాన్యం ఏదయితే అది పుచ్చుకొని కాలక్షేపం చేసేవారు.

రాజరికపువారి (దొరతనము వారి) విద్యాలయాలు పట్టణాలలో ఉండేవి. పల్లెలకు మామూలు చదువుకల ప్రైవేటు పంతుళ్ళే విద్యా ప్రదాతలు.

## బొంబాయికి పరారీ

పేరంకోసం ఆ ప్రాంతానికి వచ్చిన ఒక ముత్యాల వర్తకునితో ముచ్చట్లు కల్పి, బొంబాయి విశేషాలు విని అతనితోపాటుగా వెళ్ళిపోయాడు. వెళ్ళటానికి ముందు ఇంట్లోవారికి చెప్పాలనే ధ్యాసకూడా అతనికి రాలేదు. వెళ్ళ నివ్వరని భయం.

జనని, జన్మభూమి, విలువ ఇల్లు వదలి వెళ్ళి పరదేశంలో ఉన్నప్పుడు కాని తెలిసిరాదు. చంద్రశేఖర్ పుట్టినగ్రామం ప్రకృతి సౌందర్యాలకు పట్టుకొమ్మ. జనని అమృతమయి, ప్రేమ స్వరూపిణి, పేదరికానికి చింతల్లక ఉన్నంతలో కొడుక్కు అన్నీ అమర్చేది. అల్లారుముద్దుగా కంటికి రెప్పలా చూచుకునేది.

కొడుకు మాటమాత్రంగానైనా తనతో చెప్పకుండా వెళ్ళినందుకు ఆ కన్నతల్లి హృదయం తపించిపోయింది. కన్నీరు మున్నీరుగా విలపించి దిగులుతో మంచం పట్టింది. ఏదీ చేయడానికి వీలుపడని సీతారాం ఆవేదన అంతులేనిది.

ఇదంతా శేఖర్ ఊహించలేదు-పట్టించుకోలేదు.

బొంబాయి నగరాన్ని చూసి అంతులేని ఆశ్చర్యానికి లోనయ్యాడు. ఆ మేడలు, కార్లు-సైకిళ్ళు-రైళ్ళు కొత్త ప్రపంచంలో అడుగుపెట్టాడు. అరే

బియా సముద్రాన్ని అందులో ఉవ్వెత్తుగా లేచి విరిగిపడే అలలను, ఓడలనుచూసి ఆనందపడ్డాడు. అంతకుముందు అతడు సముద్రాన్ని చూడలేదు. పాఠ్యపుస్త కాల్లో చదివాడంతే.

ముత్యాల బేపారి శేఖర్‌ను బొంబాయిలో వదలి తనదారి తను చూసు కున్నాడు.

మహా నగరంలో ఒంటరి బాలుడు !

ఎటుచూసినా గుంపులు గుంపులుగా జనం, తనవారు కాదు. ఎత్తైన మేడలు, తనకు ప్రవేశంలేదు. ఎన్నో మిఠాయి దుకాణాలు-పళ్ళ అంగళ్ళు, తన వద్ద డబ్బులేదు.

ఆకలి వేస్తున్నది. తెలిసినవాళ్ళు లేరు. ఎవరినీ అడగలేని ఆత్మాభి మానం. ఒకటి రెండు రోజులు ఉపవాసాల్తో గడిపాడు. తనవూరు, తనవారు మదిలో మెదిలారు. అయినా వెళ్ళిపోవాలనుకోలేదు. తిరిగి వెళ్ళడానికి అతనివద్ద డబ్బూలేదు. తను తెచ్చుకున్న సొమ్ము రావడానికే సరిపోయింది. అయినా ధైర్యం చెడలేదు.

ఓడలకు రంగులువేసే పనివాళ్ళకు సహాయకునిగా పగలంతా శ్రమించి సాయంత్రం కూలీ డబ్బులు తీసుకున్నాడు. ఆ డబ్బును ఏం చేయడం. కులం, అంటు, ముట్టు పట్టింపులుండె ఎంతయినా పుట్టింది బాపన పుట్టుకయ్యె, పెరిగింది పల్లెల్లోనయ్యె. రెండు సత్తుగిన్నెలు ఇతర సరంజామా కొని వంట నారంభించాడు. చేతకాలేదాపని. ఎప్పుడూ చేసినవాడుకాదు. అతని ప్రయాసనుచూచి తమవద్ద తినమన్నారు కూలీలు. అతడంగీకరించలేదు. తనకోసంగా ఇతరులకు కష్టం కలి




గించే మనస్తత్వం అతనిదికాదు. హోటల్లోనే తినసాగాడు. తన కూలీ డబ్బులు సరిపోయిననాడు తినేవాడు లేనినాడు పస్తులుండేవాడు.

అదీ ఆయన సాదా సీదా తనం.

చంద్రశేఖర్‌కు బొంబాయి జీవితంకూడా రుచించలేదు. కూలీగా బతుకుతూ ఓ మూలపడి ఉండడానికా తాను అంత దూరంనుండి వచ్చింది. ఈ మాత్రంగాక ఇంకా ఇంతకు మిన్నగానే తన గ్రామంలో బతకగలడు. నగరాల్లో ఏముంది? ఉన్నవానికి అన్నీ ఉన్నయ్. లేనివాడికి ఏమీలేదు.

తిరిగి వెళ్ళిపోవడానికే నిర్ణయించుకున్నాడు. ప్రయాణానికి సరిపడ

పైకం జాగ్రత్త పరచుకొని, ఓ దినం బొంబాయికి సెల్యూట్ కొట్టి రైలెక్కే శాడు. సరాసరి వచ్చి వారణాసి [కాశి]లో దిగాడు. ఇంటికి వెళ్ళటానికి మనసు వెనుక ముందాడి అక్కడే ఓ సత్రంలో ఆగాడు.

# ఆజాద్ అయ్యిందెలా?

అతడు కాశీకి వెళ్ళింది 'క్విట్ ఇండియా' ఉద్యమం తీవ్రంగా ఉన్న రోజులు. ఎటుచూసినా ఖద్దరు టోపీలు. మూడురంగుల జెండాలతో కాంగ్రెసువారి ఊరేగింపులు, నినాదాలు, ప్రసంగాలు. అంతా కోలాహలంగా కనిపించేది.

చంద్రశేఖర్‌కు ఉత్సాహం కలిగింది. తన యీడు బాలురతో ఓ ఊరేగింపు తీసాడు.

క్విట్ ఇండియా - భారత్ ఛోడో.

భారత్ మాతాకీ జై.

వందేమాతరం!

ఈ నినాదాలు ప్రజల్లో ఉత్సాహాన్ని కలిగించేవి. ఆ మాటలు వింటే చాలు పోలీసుల్లో ఉద్రేకం కనిపించేది. అలా అన్నవారిని పిల్లలనైనా పెద్దలనైనా పురుషులనైనా, స్త్రీలనైనా అరెస్టుచేసి లాక్కెళ్ళి చెరసాలల్లో త్రోసేవారు.

పదిహేనేళ్ళ లేని చంద్రశేఖర్‌లో పట్టరాని ఆవేశం పొంగి పొర్లు తున్నది.

భారత్ మాతాకీ-అని బిగ్గరగా అన్నాడు.

జై!- అని సహచరులు దిక్కులు పిక్కటిల్లేలా అరిచారు. ఇంకే

ముంది కొంపమునిగింది. టక టక బూట్లు, లాఠీలు పరుగులు తీసినై. చంద్ర శేఖర్ వెంట ఉన్న పిల్లలు తుపాకిపప్పుడు విన్న పిట్టలవలె దెబ్బల భయంతో తలొకవైపు పరుగుతీసారు. ఆ దెబ్బలను, బెదిరింపులను ఈటినీ లెక్కచేయకుండా ధైర్యంగా నిలబడి ఉన్నాడు శేఖర్ వీర హనుమాన్‌లా.

పోలీసులు అతన్ని బంధించి తీసుకెళ్ళారు. మనసులు ఉసూరు మంటున్నా తమకేం ప్రమాదం మూడుతుందో అని భయంతో ఇండ్లలోనూరి తలుపులు మూసుకున్నారు వాడవాళ్ళు.

చంద్రశేఖర్‌పై కేసుపెట్టారు. కోర్టులో హాజరుపరచారు. ఆంగ్ల న్యాయాధికారి విచారణ ఆరంభించాడు. ఆ అందమైన బాలుడు నేరస్థుని స్థానంలో నిలిచాడు.

"నీ పేరేమిటి" మెజిస్ట్రేట్ అడిగాడు.

"ఆజాద్" (స్వతంత్రుడు) ధైర్యంగా బదులిచ్చాడు.

"మీ తండ్రి పేరేమిటి?"

"స్వాతంత్ర్యం."

ఆ మాటలకు అబ్బురపడి న్యాయాధికారి ఒక క్షణం ఆ బాలునివైపు చూసి మరో ప్రశ్న వేశాడు.

"మీ ఇల్లెక్కడుంది?"

"కారాగారం." అది ఆ కాలంలో దేశభక్తులకు విధించే సర్వ సాధారణమైన శిక్ష.

అధికారి నీళ్ళు నమలసాగాడు. కోపంతో నిండిపోయాడు. అతడు



'నా బాలిక్' [పద్దెనిమిది ఏండ్ల వయస్సు లేనివాడు] కాకపోతే కఠినమైన శిక్ష విధించేవాడు. ఆ న్యాయ పరిపాలకులకు సైతం ఒక న్యాయ చట్టం 'శిక్షాస్మృతి' అనేది ఉందికదా. ఎంతటి కానిపనులైనా న్యాయం ముసుగులోనే చేయటం ఒక యుక్తి. అలా కాకపోతే ప్రజాభిమానం కోల్పోతామని భయం. ధర్మ ప్రభువు అన్న పేరురాదు. దయతో పదిహేను బెత్తపు దెబ్బలు శిక్షగా ప్రకటించాడు. స్వతంత్ర్యం కోరిన (తెలిసో తెలియకో) స్వదేశ బాలునికి విదేశీ ప్రభుత్వం విధించిన విలువైన బహుమానం అది.

అతన్ని జైలుకు తీసుకెళ్ళి శిక్ష అమలు పరచటానికి ముందుగా అల్లరి చేయకుండా ఉండాలని త్రాడుతో రెండుచేతులూ కట్టివేయసాగారు.

"ఎందుకు కట్టివేస్తున్నారు?" అడిగాడు.

"శిక్ష అమలు పరచటానికి" చెప్పారు వాళ్ళు.

"ఆ అవసరం లేదు. అందుకు సిద్ధపడే వచ్చాను. మీ పని కానిచ్చు కోవచ్చు" అన్నాడు మొండిగా.

సుకుమారమైన అతని శరీరంపై బెత్తపు దెబ్బలు పడసాగినై. అతడు పరుగెత్తలేదు. అరవనూలేదు. ఆ బాధనంతా సహించుకుంటూనే దెబ్బ దెబ్బకు బిగ్గరగా నినాదాలు చేయసాగాడు.

భారత్ మాతాకీ జై - మహాత్మాగాంధీకీ జై.

చంద్రశేఖర్ గుండె నిబ్బరానికి ప్రజలు ఆశ్చర్యపడ్డారు. పత్రికల్లో అతని ఫోటోలు వచ్చినై. ఈతని ముచ్చట్లు కథలుగా చెప్పుకున్నారు జనం.

నిజానికి ఆ రోజుల్లో దేశభక్తులకు ఘోరమైన శిక్షలు విధింప బడు తుండేవి. ఏయే శిక్షలు వేసి పర ప్రభుత్వం తమను చంపగలదో ముచ్చటిస్తూ నాటి ఉద్యమకారులు నవ్వుకునేవారు. వారు జీవితాన్ని లెక్క-చేయని త్యాగధనులు.

ఆ బాలవీరుని చూడడానికి జనం తండోప తండాలుగా అతని బసకు రాసాగారు. అప్పుడు జ్ఞానవాపీ వీధిలోని ఒక సత్రంలో ఉంటున్నాడు చంద్ర శేఖర్.

ఆనాడే నగరంలో అతనికి అభినందన సభ జరిగింది. కరపత్రాలు

పంచారు. పోలీసుల భయమున్నా సమయానికి ముందే జనంతో సభాస్థలం క్రిక్కిరిసిపోయింది.

చంద్రశేఖర్‌ను చూడడానికి ప్రజలు త్రొక్కిస లాడడంతో, అందరికీ చక్కగా కనపడేలా అతన్ని ఒక బల్లపై నిలుచోబెట్టారు. అభిమానులు వేసిన పూలదండలతో ఆ బాలుని మెడ నిండిపోయింది.

శేఖర్‌ను ఆజాద్ అనే పిలువసాగారు. అతని సాహసాన్ని అభినందించారు. ఆజాద్‌కూడా వీరావేశంతో అప్పటికి తోచింది ప్రసంగించాడు. ఆ సంఘటన చంద్రశేఖర్‌ను ప్రజలకు పరిచయం చేసింది. దేశభక్తికి దగ్గర చేసింది.

ఆ తర్వాత అతనెప్పుడూ అరెస్టుకాలేదు-కాదలచుకోలేదు. ఎప్పుడూ పోలీసులను తప్పించుకొనే తిరిగేవాడు.

అంతటి ధీర హృదయుడు ఆజాద్ !

కాశీలోని బెత్తపు దెబ్బల తర్వాత ఇక అతనెప్పుడూ అరెస్టు కాకూడదని నిర్ణయించుకున్నాడు. ఆ అనుభవం-ప్రజాభిమానం దేశభక్తునిగా మార్చింది.

## పండిత్ జీ అయ్యింది ఇలా-

ఆజాద్ ప్రాథమిక విద్య స్వగ్రామంలో మనోహర త్రివేది దగ్గరే అభ్యసించాడు. తహసిల్‌లో ఉద్యోగం, బొంబాయి ప్రయాణం కొద్దికాలపువే అయినా అతనికి ఎంతో కొంత అనుభవ జ్ఞానాన్ని మాత్రం పెంచాయి. ఉన్నత విద్యాభ్యాసానికి అవకాశం లభించింది కాశి (బెనారస్)లోనే.

ఆ కాలంలో ఉదారులైన ధనికులు స్వదేశీ సాంప్రదాయ ధర్మ రక్షణ కోసం పేద బ్రాహ్మణ పిల్లలు చదువుకోవటానికి కొన్ని ధర్మసంస్థలను ఏర్పరచే వారు. అక్కడ ఉచితంగా భోజనం పెడుతూ సంస్కృత విద్య నేర్పించేవారు.

అలాంటి ఒకానొక సంస్థలో చేరి చదువుకోసాగాడు ఆజాద్ చంద్రశేఖర్. వయసు పదిహేనుకు చేరువైంది.

బలమైన శరీరం, గంటల తరబడి గంగానదిలో ఈదటం ఆ నదీ తీరాన కూర్చుని గంటల తరబడి ఆలోచిస్తూ ఉండటం అతనికి పరిపాటి అయింది.

కాశీ పండితుల నిలయం కదా. ఎక్కడ ఏ సాహిత్య సభ, వేదాంతగోష్ఠి జరిగినా వెళ్ళి వినేవాడు. తీరిక వేళల్లో గ్రంథాలయానికి వెళ్ళి పత్రికలు చదువుతుండేవాడు.

తర్వాత కాశీ విద్యాపీఠంలో చేరాడు.

కొడుకు కాశీలో ఉన్న విషయం తెలిసి జగరానీదేవి అప్పుడప్పుడు రెండుమూడు రూపాయలు పంపిస్తూ ఉండేది. వాటిని ఎంతో ప్రయాసపడి సమకూర్చుకునేది. తనయుని చూడాలని ఆ తల్లి హృదయం ఎంతగా తల్లడిల్లేదో, అదేమిటో కాని ఆజాద్ ఎప్పుడూ తిరిగి తన వూరికి వెళ్ళలేదు. వెళ్ళకూడదనే దేమీ లేదు. కాని ఎప్పటికప్పుడూ ఆ ఆలోచనను ఏదో ఓ కారణంగా వాయిదా వేస్తూ వెళ్ళాడు. చివరిదాకా అలాగే గడిచిపోయింది.

అన్న సుఖదేవ్ కూడా అర్థాంతరంగానే మరణించాడు. ఉన్న ఒక్క కొడుకూ ఇలా ఇంటికి దూరమైనాడు.






విద్యాపీఠంలో ఆజాద్‌కు మంచి గుర్తింపు ఉండేది. అతని ధ్యాసంతా "ఆంగ్లేయులను మనదేశం నుంచి తరిమివేసేదెలా?" అనే విషయంతోనే ఉండేది. పోరాటకాంక్ష తీవ్రమయ్యేది. అందుకే పుస్తకాలకంటె ఎక్కువగా నవయువకులతో మైత్రి పెంచుకునేవాడు. క్రమంగా చదువుకు స్వస్తి చెప్పాడు. ఉద్యమానికి మనస్సు అంకితమైంది. మిత్రులు అతన్ని ప్రేమగా "భైయ్యా" అని, గౌరవంతో 'పండిట్‌జీ' అని పిలిచేవారు.

అతని స్వభావాన్ని గూర్చి విప్లవవాది సుశీలాదేవి భగవతీచరణ్ సోదరి ఇలా వ్రాసింది.



"ఆయనలో ఎంత కఠోరత ఉండేదో అంత కోమలత ఉండేది. సీదా సాదాగా ఉండేవాడు. భోజన విషయంలోనూ అంతే. పడుకున్న వ్యక్తులను లేపి కూడా విషయసమాలోచనం కావించేవాడు. స్త్రీలను గౌరవించేవాడు.

పార్టీ వ్యక్తులు సినిమా మొదలైన వినోద ప్రదర్శనలకు వెళ్ళటం కూడా వారికి నచ్చదు. (భగత్‌సింగ్‌కు సినిమాలు చూసే అపేక్ష జాస్తి) అలా ప్రజాధనం దురుపయోగం అవుతుందని వారి అభిప్రాయం"

# హిందూస్థాన్ ప్రజాతంత్ర సంస్థ

దేశ విముక్తి పోరాటంలో ఎందరో ఉద్యమకారులు కారాగార శిక్షల పాలయినారు. అయినా ఎన్నో పోరాటసంస్థలు నూతనంగా ఏర్పడుతూ రహస్యంగా పనిచేస్తూండేవి. అది ఉరకలు వేసే ఉత్సాహం; ఎరుగులేని ఉద్రేకం.

అండమాన్ దీవుల నుంచి విడుదలపొంది వచ్చిన శచీంద్రనాథసన్యాల్ 'క్రాంతికారి దళ్' స్థాపించితే, బెంగాల్‌లో సురేంద్రభట్టాచార్య 'అనుశీలన సమితి' స్థాపించాడు. లక్ష్యం ఒకటే అయినందున ఆ రెండు సంస్థలు ఏకమై 'హిందూస్థాన్ రిపబ్లికన్ అసోసియేషన్' పేరుతో (భారత సంయుక్తప్రజాతంత్ర రాజ్యాల ప్రభుత్వ సంస్థగా) రూపొందినది. దేశంలోని ప్రతివ్యక్తికీ ఓటుహక్కు, స్వేచ్ఛ, పీడనలేని ప్రభుత్వం, వాటిని సాధించుట తమ ధ్యేయముగా ప్రకటించారు.

కాశీనగర ఆందోళన నిర్వాహకులుగా శచీంద్రనాథబక్షీ, రవీంద్ర మోహనసర్కార్, రాజేంద్రలాహిరీ నిలిచారు. వీరు ఆజాద్‌ను తమ సంస్థలో చేర్చుకున్నారు.

షాజహాన్‌పూర్ విభాగానికి పండిట్‌రాంప్రసాద్ బిస్మిల్ అధిపతి. క్రమంగా ఈ సంస్థ అభివృద్ధి చెందుతూ అందులో అష్‌ఫాక్‌ఉల్లా, డా॥ రోషన్ సింగ్, మన్మథ్‌లాల్‌గుప్తా, రాంకృష్ణఖత్రి, దామోదర్ శేఠ్, భూపేంద్రసన్యాల్ మొదలైనవాళ్ళెందరో చేరినారు.

ఆజాద్ ఆ సంస్థలో సామాన్య సభ్యుడుగా ప్రవేశించినప్పటికి చురుకుగా పనిచేసి సంస్థ నాయకస్థానానికి చేరుకోగలిగాడు. అతడు అనేకులను తమ సంస్థలో చేర్చాడు, శాంతికాముకులను కూడా మార్చాడు. మొదట వాళ్ళు చెప్పేది ఓర్పుతో వినేవాడు, పిదప నేర్పుతో సంభాషించి తన మార్గానికి లాగేవాడు.

శాంతి-అహింసల గాంధిజీ సత్యాగ్రహాల పోరాటం చల్లబడిఉండప్పుడు 1922లో. 1921 డిసెంబర్ 31 నాటికి తప్పక స్వాతంత్ర్యాన్ని పొందుతాం నా మాట వినండి నా మార్గాన్ని అనుసరించండి అని ఏడాది క్రితం ప్రతినపూనాడు. తన ఆశయం నెరవేరక ఉద్యమంలో హింస చేరటంతో గాంధీ తన ఉద్యమం విరమించాడు. నిజానికి సహాయనిరాకరణ పోరాటం సాగించారు-శాంతి అహింసలకు ఇంకా పూర్తిగుర్తింపు రాలేదు. ఆయన నాయకత్వంలోనడచిన స్వాతంత్ర్య పోరాటకారులు నిరాశపడ్డారు. కొందరు నీరసంగా ఇంట కూర్చుని ఉంటే-శాంతి మార్గం సరియైనదికాదని మరికొందరు ఉత్సాహపరులు ఈ నూతనపోరాటసంస్థలో చేరిపోయారు.

## సంస్థ వ్యాప్తికై కృషి

హిందూస్థాన్ ప్రజాసంస్థ (హెచ్.ఆర్.ఎ) అభివృద్ధి-వ్యాప్తి కోసం తీవ్రమైన కృషి సాగింది.

సమితి ఆశయాలను తెలియపరచే కరపత్రాలను రంగూన్ నుంచి పేషావర్ వరకు పంచారు. ఆంగ్లంలో ప్రచురించిన ఈ పాంప్లెట్స్‌లో నవయువకులను సంస్థలోనికి ఆహ్వానించారు.

దేశంలోని విభిన్న ప్రాంతాలలో ఉన్న విముక్తిపోరాట సంస్థలన్నీ ఈ కరపత్రంతో మేల్కొన్నవి. బ్రిటిష్‌వారిని దేశం నుంచి పంపించే పోరాటంలో ఈ సంస్థలన్నీ సమైక్యం కావల్సిన అవసరం ఉందనే సంకల్పం వారికి కలిగింది.

పంజాబ్‌లో "నౌజవాన్ భారత్ సభ" దీనితో కల్సిపోవటానికి ఉత్సాహం చూపింది. దాని స్థాపకులు భగవతీచరణ్, భగత్‌సింగ్, జయచంద్ర విద్యాలంకార్, సుఖదేవ్, యశపాల్ మొ॥వారు అందులో క్రియాశీల పాత్ర నిర్వహించారు.

వరుసగా కొన్ని కరపత్రాలు పంచి తర్వాత పుస్తకాలు పంచసాగారు. హెచ్.ఆర్.ఎ వాళ్ళు దేశ పరిస్థితులను వివరించే చరిత్రలు-జీవన చరిత్రలు, విముక్తి పోరాటాలు, ఫ్రెంచి, రష్యా, ఐర్లాండ్ మొ॥ విదేశాల విప్లవ చరిత్రలు ఎంపిక చేసుకొని పంచేవారు. చదువు విలువైంది కదా.

చదువనివాడ జ్ఞుండగు.
చదివిన సదసద్వివేక చతురత కలుగున్.

అని హిరణ్యకశిపుడంటాడు ప్రహ్లాదునితో 'పోతన 'భాగవతంలో'

ఈ కరపత్రాలుకానీ, పుస్తకాలుకానీ, సంస్థ వ్యక్తులకు చేరవల్సిన ఉత్తరాలుకాని కొత్త పద్ధతుల్లో పంపించేవారు. ప్రత్యేక సంకేత స్థలాలుండేవి. సంస్థకు ఏ మాత్రం సంబంధంలేని నమ్మకస్తులైన ఇతర వ్యక్తులద్వారానే వాటిని

పంపిస్తుండేవారు. పోలీసుల కళ్ళు కప్పటానికి వాళ్ళనుసరించే విధానాలనేకాలు. క్రమంగా సంస్థ బాగా అభివృద్ధి చెందింది. 1922 నాటికే పంజాబ్, బెంగాల్, ఒరిస్సా, యునైటెడ్ ప్రావిన్సెస్, మొ॥ ప్రాంతాలలో దీనికి శాఖలేర్పడినై. వేల సంఖ్యలో బలం లేకున్నా చిత్తశుద్ధితో శ్రమించే కార్యకర్తలే అందరూ. అప్పుడు మనదేశంలోని మరే పోరాట సంస్థకానీ ఇట్లా శాఖలుగా బహుముఖాల విస్తరించలేదు.



కాంగ్రెస్ చల్లబడింది. గాంధీజీ హరిజనసేవ, మద్యపాన నిషేధం, ఖద్దరు ధారణ వంటి నైతిక మార్గాల ప్రచారం చేస్తున్న కాలంలో ఈ వీర యువకులు ప్రాణాలు లెక్కచేయక దేశ స్వాతంత్ర్యంకోసం సాయుధ పోరాటానికి పూనుకున్నారు.



అంతా బాగానే వుంది కాని డబ్బు సమస్య వచ్చిపడింది. సంస్థ నిర్వహణకు, ఆయుధాలకు, ఇతరాలకు డబ్బు ప్రధానంగా అవసరమై ఉంది. అభిమానులందిచ్చే రహస్య చందాలతోనే ఇంతకాలం సమితి నడుస్తూ వచ్చింది. కాని ఎంతకాలమిలా? సొంత ఆర్థికబలం ఉండాలనే కోరిక ఆజాద్‌కు పట్టుకుంది. కార్యకర్తల భోజనాలకే కష్టమయ్యే పరిస్థితి ఏర్పడింది. ఏమి చేయడం?

సంస్థ ముఖ్య వ్యక్తులు సమావేశమై సమాలోచన జరుపుకున్నారు. చందాలు తప్ప మరో ఆదాయమార్గం లేదు.



పండిత రాంప్రసాద్ బిస్మిల్, రాజేంద్రలాహిరీ, యోగేశ్ బాబు అశ్‌ఫాకుల్లా, శచీంద్రనాథబక్షీ, రోషన్‌సింగ్, మన్మథలాల్ గుప్త, రాంకృష్ణఖత్రీ చర్చలో పాల్గొని చివరికి దోపిడీ ద్వారానే డబ్బు సేకరించాలనే నిర్ణయానికి వచ్చారు.

జతీంద్రనాథ ముఖర్జీ మొదలైన బెంగాళ్ తీవ్రవాదులు ఇదువరకే ఆ మార్గాన్ని అనుసరించారు.

రాజకీయ అవసరాలకే డబ్బు దొంగిలించడం, కాని, ప్రభుత్వం దృష్టి నుంచి తప్పించుకోవాలంటే ఈ దోపిడీలు పల్లెల్లోనే చేయాలి. అదీ ధనికులయిన వ్యాపారులను దోచ నెంచారు.

అందుకూ కొన్ని నియమాలేర్పరచుకున్నారు. వీలైనంతవరకు హత్యలు చేయకూడదు. స్త్రీలను గౌరవంగా చూడాలి. చేసేది దొంగతనం, అధర్మపుపని. అయినా ఆ ధనాన్ని ధర్మయుద్ధానికి కదా వినియోగించేది. అందుకే ఆ నిర్ణయాలు.

ఈ చోరకర్మకు నాయకత్వం రాంప్రసాద్ బిస్మిల్‌ది. ఆజాద్ ఒక ముఖ్య కార్యనిర్వాహకుడు. అందుకు కొన్ని కొత్తపదాలు వాడుకలోనికి తెచ్చుకున్నారు రహస్య సంభాషనకు. జ్ఞాని అంటే దొంగతనం చేసేవ్యక్తి, అందులో అంతగానిపుణత లేనివాడు భక్తుడు. నేర్పరి అవధూత!

జ్ఞాన్ జోహ్రో సో బరిండా అనే వాక్యం తమ పని చెడినప్పుడు జాగ్రత్త కోసం వినియోగించేది.

ఆజాద్ కార్యదీక్షను గూర్చి పండిత్ రాంప్రసాద్ బిస్మిల్ అన్న మాటలివి.

"అతని స్ఫూర్తి, ఆవేశం, నిర్భీతి చూస్తే 'క్విక్‌సిల్వర్' (పాదరసం) అనిపించుతుంది. అతి ప్రమాదకరమైన విప్లవకార్యాల్లో ఆజాద్ అందరికంటే ముందుండేవాడు. ఇంకా ఉత్సాహంగా తనకు బాల్యంలో పులిపాలు త్రాగించారని అనేవాడు. అంటే అది సత్యమనికాదు. కాని, ఆజాద్ అంతటి నిర్భయం సాహసం పౌరుషం కలవాడన్న మాట!"

మొదట ఒకటి రెండు ఓటములు సంభవించినా తర్వాత దొంగతనాల్లో విజయాలు సాధించారు.

అయినా ఈ జీవితంలో ప్రమాదాలెక్కువ. దొరికిన డబ్బు అవసరాలకు సరిపోకపోయేది. పైగా ఈ పని పార్టీప్రతిష్టకు భంగకరంగా ఉండేది. ప్రజల అభిమానం దెబ్బతింటుంది. అందుకని ఇలాకాక వేరు పద్ధతుల్లో డబ్బు సంపాదించాలనే అభిప్రాయానికి వచ్చారు.

సర్కారీ బ్యాంకులు, రైళ్ళు దోచడం భేషుగ్గా ఉంటుందనే నిర్ణయానికి వచ్చారు. అలాగయితే పార్టీ అవసరాలకు సరిపడ ఫలితం ఉంటుంది. ప్రభుత్వానికి భయం, ప్రజలకు అభిమానమూ పెరుగుతాయి.

ఆలోచన వచ్చిందే తడవు, ఆచరణకు పూనుకున్నారు. ఈ విప్లవ వీరుల మొదటి సాహసిక దండయాత్ర, 'కాకోరీ రైలు దోపిడి'.

## కాకోరీ రైలు దోపిడి

భారత స్వాతంత్ర్య పోరాట చరిత్రలో మహా సాహసంతో కూడిన ఈ రైలుదోపిడీ 9 ఆగష్టు 1925 నాడు జరిగింది.

ఉత్తరప్రదేశ్‌లో కాకోరీ చిన్న రైల్వేస్టేషన్. షాజహాన్‌పూర్ నుండి లక్నో వెళ్ళే రైలు రాత్రి 8 గం|| అక్కడికి చేరుతుంది.

అక్కడ ముందే టికెట్లు తీసుకొన్నారు.

చిమ్మచీకటిని ఒంటికంటితో చీలుస్తూ ఇనుపపట్టాల మార్గంపై జెర్రిలా రంయ్యిమని దూసుకుపోతున్నది బొగబండి.



ప్లాను ప్రకారం రాజేంద్ర, బక్షీ గొలుసులాగారు. ఆలంనగర్ స్టేషన్‌కు కొంతదూరంలో రైలు ఆగింది. వారిద్దరు దిగి పట్టాల వెంట వెనుకకు పరుగెత్తసాగారు. వారికి ఎదురుగా వస్తున్న గార్డు రైలెవరాపారని అడిగితే "మేము, మానగలపెట్టె కాకోరి స్టేషనులో మరచిపోయాం. అక్కడికి పోతున్నాం." అని అదే పరుగు సాగించారు. అప్పుడు ట్రేన్‌కు చివరగా ఉండే గార్డు పెట్టెలోనే సర్కారు డబ్బు రవానా అవుతుండేది.

అక్కడికి చేరగానే విప్లవకారులు గాలిలో తుపాకి పేల్చి "మేం ప్రభుత్వ ఖజానాను దోస్తున్నాం. ఎవరూ కదలకండి పెట్టెదిగితే ప్రాణాలు దక్కవు. జాగ్రత్త!" అని హెచ్చరించారు.

వెనక్కి తిరిగి వచ్చినగార్డు రైలు కదలడానికి పచ్చజెండా ఊపబోతే అతన్ని పిస్తోల్‌తో బెదిరించి నేలపై బొలికలపడి ఉండేటట్లు చేశారు. తమ పని కొనసాగించారు. ఇంతలో ఇతర కార్యకర్తలు కూడా చేరవచ్చినారక్కడికి.

బోగీ నుండి డబ్బుపెట్టెలాగి బయటపడవేసి, దాని తాళాన్ని పగలకొట్టి రూపాయల సంచులను మోసుకొని కాకోరి ఘనారణ్యాలలో కలసిపోయారు. అంతా తొమ్మిదిమందే రైలుదోపిడీలో పాల్గొన్నవాళ్ళు.

ఇంత భయంకర సన్నివేశం ఏఒక్క వ్యక్తికికానీ చిన్నదెబ్బయినా తగలకుండా అనుకున్న ప్రకారం సులభంగా జరిగిపోయింది. కాని అదే ఆ తర్వాత పెద్దప్రమాదాన్ని తెచ్చిపెట్టింది. మరునాడే ఈ సంచలన వార్తను పత్రికలు పెద్దపెద్ద అక్షరాలతో ప్రచురించాయి. ప్రభుత్వం భయంతో కంపించినా నేరస్తులను పట్టుకోవడానికి పోలీసులను గూఢాచారులను అధిక సంఖ్యలో వదలింది.

విప్లవకారులకు ఆ ప్రాంతంలో కాలుకదపడం కష్టమయింది. కాశీ, లక్నో నగరాల్లో సంచరించడం ప్రమాదంగా మారి వారంతా తలకోదారిగా చెదరిపోయారు. మొదట ప్రాణరక్షణ-తర్వాత ఆశయ సాధన-అనుకున్నారు. ఆజాద్ అనుకోని ఈ పరిస్థితికి లోలోన దిగులుచెందినా పైకి మాత్రం గంభీరంగా ఉన్నాడు.

26 సెప్టెంబర్‌నాడు పెద్దయెత్తున అరెస్టులు కావడంతో, దొరకనివారు తప్పనిసరియై అజ్ఞాతవాసానికి వెళ్ళారు.

ఆజాద్ తన జన్మగ్రామమైన 'బాంవరా'కు వెళ్తానని చెప్పి బయటపడినా సరాసరి బనారస్‌కే వెళ్ళాడు. ఇలాంటి పరిస్థితుల్లో స్వగృహంలో ఉంటే పోలీసుల దృష్టిలో తేలికగాపడే ప్రమాదముందనే అతడాపని చేశాడు.

కాకోరీ రైలుదోపిడితో యు.పి.లోని ముఖ్యనగరాలన్నింటిలో అరెస్టులు జరుగుతున్నవి. పట్టుకున్నవారికి పెద్దపెద్ద బహుమతులు ఇస్తామంటూ,

దోషుల ఫోటోలతోసహా ప్రకటనలు ప్రచురితమైనవి. అవి చూసి మరీ రహస్య ప్రాంతాలకు చేరుకున్నారు వాళ్ళు.

## ఝాన్సీలో

ఆజాద్ ఝాన్సీకి వెళ్ళాడు. అది యు.పిలోని చారిత్రక పట్టణం. 1923-24లో క్రాంతిసంస్థ సమావేశానికి వెళ్ళాడింతకుపూర్వం. అప్పుడు పరిచయమైన రుద్రనారాయణ అనే డ్రాయింగ్ టీచర్ ఆజాద్‌ను ఆదరించాడు. ఒక వ్యాయామ క్రీడాస్థలంలో అతని ఇల్లుంది. అక్కడికి వచ్చిపోయే వారినుంచి, పోలీసుల నుంచి



ఎంతో జాగ్రత్తగా ఆజాద్‌ను రహస్యంగా కాపాడేవాడు. పట్టణం మధ్య ఉండి ప్రజల దృష్టినుంచి తప్పించుకోవటం ప్రయాసతో కూడినపని. ఎప్పుడైనా ప్రమాదం ఎదురుకావచ్చు. అందుకే సమీపంలోని అడవిలో ఉండే ఏర్పాటు చేశాడు ఆజాద్‌కు రుద్రనారాయణ.

'తారార' నదీతీరంలో ఒక పర్ణశాల నిర్మించుకొని సాధుజీవితం గడప సాగాడు ఆజాద్. అక్కడో పాడుపడిన చిన్నగుడి ఉండేది. హనుమద్భక్తుడుగా పూజాకార్యక్రమాలు చేస్తున్నట్లు నటిస్తూ జనం కన్నుకప్పి కాలం గడిపాడు.

ఆతని మత అనాసక్తిని యశపాల్ 'సింహావలోకన్'లో ఇలా తెలిపాడు.

"మతాన్ని గూర్చి మా అభిప్రాయం ఏమిటని అడిగితే ఒక్కటే చెప్పగలను. మాకు హిందువు ముస్లిం అన్న వ్యత్యాసం లేదు. ఆజాద్ బ్రాహ్మణుడు. అతనికి విప్లవ సంఘంలో పండిత్ అన్న ఉపనామం సైతముంది. అవసరమైతే చాల శ్రోత్రియంగా త్రికాల సంధ్యావందనాన్ని ఆచరించగలడు. కాని, అతనికి జంధ్యంమీద, సంధ్యమీద చెడ్డమంట. జంధ్యాన్ని సంధ్యనూ-ఆత్మ విశ్వాసం లేకపోవటానికి, బుద్ధిహీనతకు, వేషానికి, ప్రతిరూపాలని ఆజాద్ ఉద్దేశ్యం. పూజలూ అనుష్ఠానాలు చేసే వ్యక్తిని అతడంతగా విశ్వసించడు."

అడవికి వెళ్ళకముందే ఒక మోటార్ డ్రైవర్ దగ్గర సహాయకునిగా చేసి మెకానిజం, కారు డ్రైవింగ్ నేర్చుకున్నాడు ఆజాద్. అది అతనికి తర్వాత కాలంలో చక్కగా పనికి వచ్చింది.

కళాప్రియుడు కాంగ్రెసు అభిమాని అయిన ఒక రాజావారితోనూ పరిచయం ఏర్పడి అతని చెంత ప్రసంగాలతో కాలక్షేపంతోపాటు పసందైన విందులు గుడిచాడు ఆజాద్.

కాకోరీ కుట్రకేసు వల్ల మిత్రుల్లో పలువురు జైలుపాలయ్యారు. మిగతావారు చెల్లాచెదరై ఎక్కడెక్కడో దాగి ఉంటున్నారు. తాను ఒంటరిగా అడవిలో క్రూరమృగాల మధ్య ఉన్నాడు. తన కష్టజీవితానికి ఏనాడూ దిగులు ఆవరించేది కాదు. భవిష్యత్తులో ఉద్యమం నిర్వహించేదెలా, మిత్రులను రక్షించే దెలా అనే ఆలోచనలతో విచారంతో కాలం గడిపేవాడు.

రుద్రనారాయణ మాస్టారు ఎంతగానో సహకరించాడు. అతనిఇల్లెప్పుడు పోరాటకారులకు విడిదిగా ఉండేది. దేశ స్వాతంత్ర్యం కోసం ఆయనసైతం పరితపించేవాడు. తనవంతు బాధ్యతగా ఉద్యమకారులకు సహకారం అందించేవాడు. ఆయనకు ఫోటోగ్రఫీ ఇష్టం. ఆయన ఒకసారి సరదాగా తీసిందే ఇప్పుడు మనం చూసే ఆజాద్ ఫోటో- మీసం మెలిపెట్టి గంభీరంగా కనిపించేది.

## భగత్ సింగ్ కలిశాడు

అదో విచిత్రమైన పరిస్థితుల్లో జరిగింది. ఇద్దరు విప్లవయోధులు ఆజాద్- భగత్‌సింగ్‌ల కలయిక.

అప్పుడు కాన్పూర్‌లో గణేశశంకర విద్యార్థి పత్రిక 'ప్రతాప్' ముద్రణాలయంలో పని చేస్తూ కాలం గడుపుతున్నాడు భగత్‌సింగ్. కొడుకు విప్లవభావాలు నచ్చక పెళ్ళి చేసుకొని ఇంటిపట్టున ఉండాలనే తండ్రి పోరును భరించలేక తప్పించుకొని వచ్చాడు భగత్‌సింగ్. తాను చేరిన పంజాబ్ 'నౌ జవాన్ భారతసభ' పూర్తి సంతృప్తి నీయలేక పోయింది. ఇంటికి దూరంగా ఉంటున్నప్పుడు ఏదో ఓ వ్యాసంగం కావాలి. పొట్ట గడవాలి. అదే ప్రయత్నంలో ఢిల్లీలోని 'అర్జున్' పత్రికాఫీసులో చేరాడు. అక్కడినుండి ఉత్తరాలతో సంప్రదింపులు జరిపి ఇక్కడికి చేరుకున్నాడు. గణేశశంకర్ కాంగ్రెసువాది అయినా ఉత్సాహంకల యువకులకు మంచి ప్రోత్సాహం అందించేవాడు. 'బలవంత్' పేరుతో భగత్ రాజకీయ వ్యాసాలు సైతం వ్రాయసాగాడు.

మారువేషాల్లో తిరుగుతూ మిత్రుల్ని విడిపించే ప్రయత్నంలో, ఆజాద్ ఆ పత్రికా కార్యాలయానికి వచ్చాడు. ఆజాద్ రాక చూసి "ఆయియే పండిత్ జీ" అన్నాడు గణేశశంకర్. చేస్తున్న పని ఆపి తలెత్తి అటు చూసాడు

భగత్‌సింగ్. మహా తేజస్వి, గంభీరుడు, నిరాడంబరంగా కనిపించిన కొత్తవ్యక్తిని అలాగే చూడసాగాడు.

"నువ్వు పండిత్‌జీని చూడాలని ఆత్రపడుతున్నావు కదా బలవంత్! నీ కోరిక పూర్తి అవుతున్నది." అన్నాడు గణేశ శంకర్ విద్యార్థి చిరునవ్వుతో.

హర్షాతిరేకంతో కళ్ళు పెద్దవిచేసి "ఓహో! క్రాంతిదేవత పండిత్ చంద్రశేఖర ఆజాద్" చేతులుచాచి ముందుకు నడిచాడు భగత్.

"వాహ్ తమ్ముడూ! బాగా దొరికావ్. నేను నీ అన్వేషణలోనే ఉన్నాను." అని ఆజాద్ భగత్‌ను గుండెల కదుముకున్నాడు. రెండు కాగడాలు కల్సినట్లు అయింది. ఇద్దరి కళ్ళూ చెమ్మగిల్లినై.



ఇద్దరిదీ ఒకే ఆశయం. దేశ స్వాతంత్ర్యం సిద్ధించేవరకూ వారికి తృప్తిలేదు- విశ్రాంతిలేదు. ఛిన్నా భిన్నమై పోయిన విప్లవకారులను తిరిగి ఏకం చేయటానికి వారికి ఉభయులకు ఒకరితోడ్పాటు ఒకరికి కావల్సి ఉంది. వారి స్నేహం ప్రగాఢమైంది. ఉద్యమం బలపడింది. దేశం లాభపడింది.

## వీర పురకాలు

కాకోరీ కుట్ర కేసు పద్దెనిమిది మాసాలు నడిచి పద్దెనిమిది రోజుల మహాభారత యుద్ధాన్ని తలపించింది. ఈనాడు క్రికెట్ కామెంట్రీ వినడానికి మనం రేడియోల, టెలివిజన్ల ముందు వదలకుండా కూర్చుంటున్నామే, ఆనాడు, దేశ విముక్తి కోసం ప్రాణాలకు తెగించి పోరాడుతున్న ఆ వీర యువకుల కేసు గురించి ప్రజలు ఎంత ఉత్సుకత చూపి ఉంటారో, దేశం ఎంత సంచలనం పొంది ఉంటుందో ఊహించండి.

ఆ కాలంలోనే ప్రభుత్వం ఈ కేసు కోసం పదిలక్షల రూపాయలు వ్యయపరచింది. అప్పుడు సుమారు 25 రూ॥ తులం బంగారం. ఇప్పుడు 2500కు. తులం. అంచనా వేయండి. ఎంత పెద్ద మొత్తమో. ఇప్పటి విలువ ప్రకారం పదికోట్లన్న మాట.

దోషులపై 24 నేరాలు మోపారు.

శచీంద్రబక్షీ, ఆజాద్‌లను మాత్రం అరెస్టు చేయలేక పోయారు. దామోదర స్వరూప్ సేఠ్ తీవ్రంగా అనారోగ్యపడినకారణంగా కస్టడీ నుంచి వదిలేశారు.

ప్రభుత్వం ఈ పోరాట వీరులపై మోపిన నేరాల్లో ముఖ్యమైనవి నాలుగు. 1) బ్రిటిష్ చక్రవర్తిపై యుద్ధమును ప్రకటించుట. 2) రాజనీతినేరం. 3) లూటీలు 4) హత్యలు.

ప్రభుత్వం తరఫున వాదించిన న్యాయవాది జగత్‌నారాయణముల్లా. ఆయనకు దినానికి 500 రూ॥ ఫీజు.

నిందితులవైపు గోవింద వల్లభపంత్, చంద్రభానుగుప్త, మోహన్ లాల్ సక్సేనా మొదలైన న్యాయవాదులు నిలిచారు.

ఇంతకూ ఆ రైలు దోపిడీలో వీరు కొల్లకొట్టిన ధనం 1541 రూ॥లు (నాణేలు). 1000 రూ॥ నోట్లు అంతా 4541. మరికొన్ని రశీదులున్నాయిట.

చివరికి ఏప్రిల్ 6, 1927 నాడు కోర్టు తీర్పు వెలువడింది. కఠిన శిక్షలు తప్పలేదు.

ద్వీపాంతరవాస శిక్ష — శచీంద్రనాథ సన్యాల్‌కు

14 ఏండ్ల జైలుశిక్ష — గోవింద చరణ్ సింగ్, మన్మథలాల్ గుప్తా

10 ఏండ్ల శిక్ష — యోగేశచంద్ర చటర్జీ, ముకుందీలాల్‌జీ, రాజకుమారసింహ, రామకృష్ణ ఖత్రీ

7 సం॥ కారాగారం — విష్ణుచరణ్ దుబ్లిష్, సురేశచంద్ర భట్టాచార్య

5 ఏండ్ల శిక్ష పడినవారు — భూపేంద్రనాథ సన్యాల్, రాంతులారీ త్రివేదీ, ప్రణవేశ్ చటర్జీ, ప్రేం కృష్ణ ఖన్నా.

ఇక- రాంప్రసాద్ బిస్మిల్, రాజేంద్రనాథ లాహిరీ, రోషన్‌సింగ్, అశ్‌ఫాక్ ఉల్లాఖాన్, వీరికి నలుగురికి మాత్రం మరణ దండన పడింది.

ఆజాద్ అతని మిత్రులు ఖైదులో ఉన్న క్రాంతి కారులను తప్పించాలని ఎంతగా ప్రయత్నించినా వీలుకాలేదు. భగత్‌సింగ్ స్నేహంవల్ల నౌజవాన్ భారత్ సభ' వాళ్ళు సైతం ఈ కేసు సందర్భంగా ఆర్థికంగా ఎంతో సహకరించారు. అయినా అందరిశ్రమా బూడిదలో పోసిన పన్నీరు చందమైంది. మకరం పట్టు ఆంగ్ల ప్రభుత్వానిది. అంగబలముంది అర్థబలముంది. ఇక శిక్షల

కేమి తక్కువ. ప్రమాదాన్ని పసికట్టి ఖైదీలను వేరువేరు గదుల్లో ఉంచి గట్టి కాపలా ఉంచింది ప్రభుత్వం.

మరణశిక్ష పడినవారినైనా తప్పించాలని పడిన శ్రమంతా వ్యర్థమైంది.

ఆ-దేశ భక్తులకు విప్లవవీరులకు క్రమంగా ఉరిశిక్షలు అమలు పరచ బడినవి. వారిలో లాహిరీ, రోషన్‌సింగ్‌లు కేవలం ఇరువదేండ్ల నవయువకులు.

మరణానికి ముందు మిత్రులకు జైలు నుంచి పంపించిన లేఖలో పండిత రాంప్రసాద్ బిస్మిల్ ఈ కవిత వ్రాసాడు.

మిట్ గయా జబ్ మిట్ నేవాలా
ఫిర్ సలాం ఆయేతో క్యా ?
దిల్‌కి బర్‌బాదీకె బాద్
ఉన్‌కా పయాం ఆయేతో క్యా ?
(మనిషి మరణించిన పిదపయే
జనము మొక్కిన ఫలమదేమి ?
మనసు చచ్చిన పిదప వచ్చిన
తనకు సందేశము పనేమి?)

స్నేహితులు తనను విడిపించుతారనే ఆశతో ఎదురుచూసి చూసి ఆ వీరయోధుని హృదయం ఎంతగా నిరాశచెందిందో- రాంప్రసాద్ తల్లితోపాటుగా శివవర్మ వెళ్ళి మిత్రుని చివరిసారిగా చూసి సంస్థ విషయాలు తెల్సుకొని వచ్చాడు.

వీరిలో మొట్టమొదట రాజేంద్రలాహిరీని తేదీ 17-12-1927 నాడు 'గోండా' జైలులో ఉరితీసారు. ఆ వీరుని చివరి ఉత్తరం ఇది.

"దేశపు బలిపీఠానికి మా రక్తం అవసరం వచ్చినట్లు అనిపించు తున్నది. మృత్యువు అంటే ఏమిటి? అది కేవలం జీవితంయొక్క అవతలి వైపు మాత్రమే. ఒక వేళ చరిత్రమారుట అనేది నిజమే అయితే మా మరణం వ్యర్థం కాదనే భావిస్తున్నాను. అందరికీ నా అంతిమ నమస్కారాలు.

మీ—రాజేంద్ర."

అదే అతని అంతిమ వాణి.

రాంప్రసాద్ బిస్మిల్‌ను 'గోరఖ్‌పూర్' కారాగారంలో 19-12-27న ఉరిపీఠమెక్కించారు. 19నాటి ఉదయం ఆరుగంటలకు తనను మృత్యుముఖంలోకి పంపిస్తున్నారని 16నాడే తెలిసింది. అతడు తన తల్లికి ఉత్తరం వ్రాస్తూ అందులో దేశవాసులందరికీ సందేశం పంపించాడు. జైల్లో బందీగా ఉంటూనే గుండె నిబ్బరంతో తన ఆత్మకథ వ్రాసి మూడు విడతలుగా యుక్తిగా ఉద్యమాభిమానుల ద్వారా బయటకు పంపించాడు. అది గోరఖ్‌పూర్‌లోని ప్రముఖ పత్రిక 'స్వదేశ్' సంపాదకుడు కాంగ్రెసువాది అయిన దశరథ్‌ప్రసాద్ ద్వివేదీకి అందింది. ఉద్యమకారుడైన శివవర్మ ఆ రచనను తీసుకొని 'కాన్‌పూర్'లోని గణేశ్‌శంకర విద్యార్థికి అందజేశాడు. ఆ రచన విలువను గుర్తించి 'కాకోరీ కె షహీద్' అనే పేర పుస్తకంగా ముద్రించాడాయన.

తమకోసంగా బ్రతికేవారు ప్రపంచంలో లక్షలు-కోట్లు. దేశం కోసం జనం కోసం బ్రతికేవాళ్ళు వందలు పదులు. అయినా చరిత్రగతిని మార్చేది ఆ పదుగురే కాని ఈకోట్లు కాదు.

ఉరితాడు మెడకు బిగియడానికి ముందు ఆ వీరుడు క్రించిత్తయినా

చింతించకుండా గొంతెత్తి "I wish the down fall of British empire" నేను బ్రిటిష్ సామ్రాజ్య వినాశనాన్ని కోరుతాను-అన్నాడు.

"ధర్మయుగ సాధనకోసం పోరాడి మరణించేవాడికి వనాల్లో తపస్సు చేసి మరణించినవారికి లభించే ఉత్తమగతిలభిస్తుంది. అని మనశాస్త్రాల్లో వ్రాసి ఉంది." అని ప్రగాఢ విశ్వాసాన్ని చాటి 'అలహాబాద్' బందిఖానాలో ఉరిశిక్షననుభవించిన ఠాకూర్ రాంనరేశసింహ [రోషన్‌సింగ్] వీరసందేశ గీతమిది.

"జిందగీ జిందా దిలోంకీ జాన్ ఐరోషన్

వరనా కితనే మరే పైదాహోతే జాతే హైం."

[ఎందరెందరో లోకమందున పుట్టిచస్తున్నా

అందులో చైతన్యవంతుల బ్రతుకె వెలుగన్నా!]

అశ్‌పాక్ ఉల్లా మరణం 'ఫైజాబాద్'లో జరిగింది. ఉరిశిక్షను అనుభవించటానికి ముందు ఆయన ఇస్లాం మతగ్రంథం ఖురాన్‌ను భుజానికి తగిలించుకొని 'కలాం' సూక్తులు పఠిస్తూ ఉరికంబాన్ని చేరుకున్నాడు. ఉరిపీఠాన్ని ముద్దిడుకొని "నా చేతులు మానవరక్తంతో ఎప్పుడూ ఎర్రపడలేదు. చేయని నేరాన్ని నాపైమోపారు. దేవుని దగ్గరే నాకు నిజమైన న్యాయవిచారణ జరుగుతుంది" అని ఉరిత్రాడులో తానే స్వయంగా తలదూర్చాడు.

ఆ వీరుని చివరి కవితా సందేశం—

తంగ్ ఆకర్ హంభీ ఉన్‌కే జుల్మ్‌కే బేదాద్‌సే

చల్‌దియే సుయే అదమ్ జిందానె ఫైజాబాద్‌సే॥




19 డిసెంబర్ 1927 నాడు అశ్ఫాకుల్లా శవాన్ని అతని తమ్ముడు రియాసతుల్లా 'షాజహాన్‌పూర్' తీసుకువెళుతుండగా 'బాలమవూ' స్టేషన్‌లో ఒక సూటుబూటు వ్యక్తి రైలుపెట్టెలోపలికి వచ్చాడు. "అమరవీర చక్రవర్తిని చూడవచ్చాను" అన్నాడు. అన్న ముఖంపైనున్న వస్త్రాన్ని తొలగించాడు రియాసత్. నూతనవ్యక్తి ఆ మృతదేహానికి మూడుమార్లు నమస్కరించి, జలజల కన్నీరు రాలగా "బట్టకప్పండి. నేనువస్తా-" అని దిగివెళ్ళాడు. చీకటిలోముందుకు వెళ్తున్న అతని చేతిలో లాంతర్ వెలుగుతూ ఉంది.

అతడు మరెవరో కాదు—చంద్రశేఖర ఆజాద్!

"చావును ఇట్లా ప్రత్యక్షంగా చూస్తూకూడా దాన్ని లక్ష్యపెట్టని ఈ క్రాంతి కారులనే పిరికివాళ్ళని, దౌర్జన్యపరులని అన్నారు గాంధీజీ. తాను వైస్రాయి ఇర్విన్‌కు సానుభూతి చూపే సందర్భంలో ఈ దేశం యొక్క నిజమైన చరిత్ర ఎప్పుడైనా రాయబడితే ఇలాంటి నిందలు మరచిపోబడుతాయి. స్వాతంత్ర్యసాధన ఉద్యమాన్ని తప్పువిధంగా వర్ణించిన వాళ్ళారా! ఒక నాటికి చరిత్ర తప్పక మిమ్ము ప్రశ్నిస్తుంది." అని వ్రాసాడు 'రాజేంద్రకసంవా'- భగవతీ భాయి జీవితచరిత్రలో.

## కేంద్ర సేన ఏర్పాటు

కాంగ్రెసు సాగించిన సహాయ నిరాకరణ ఉద్యమంతో దేశ స్వాతంత్ర్యాన్ని సాధించ జాలమని 1921 చివరికి తేలిపోయింది. గాంధీజీ ఉద్యమ విరమణ చేశాడు. తీవ్రవాదుల విజృంభనకు 1922 మంచి అనుకూలంగా ఉంది.

నిజానికి 1906 కలకత్తా సభల్లోనే కాంగ్రెసు చీలిపోయింది. 1916లో 'హోంరూల్' ఆరంభమైంది. 1920లో బాలగంగాధర తిలక్ మరణించాడు. మితవాద పక్ష కాంగ్రెసుకు గాంధీ నాయకుడైతే 'అతివాద పక్షానికి చిత్తరంజన్ దాస్ నాయకుడు.

లాలాలజపతిరాయి విప్లవకారులకన్నా మితవాదంలో ఉన్నా అయిన అతివాద కాంగ్రెస్ నాయకుడు. ఆయన తన పత్రికలలో అన్ని వర్గాల వారి అభిప్రాయాలకు స్థానమిచ్చేవాడు.

చిత్తరంజన్‌దాస్ మోతీలాల్‌నెహ్రూ తదితరులు కల్సి 1923లో

స్థాపించిన 'స్వరాజ్యపార్టీ', లాలాజీ 'నేషనల్‌పార్టీ' కాంగ్రెసుతో సరిపడకనే రూపొందాయి.

అప్పుడు 1922లో మితవాద కాంగ్రెసు ప్రజాసేవ కార్యక్రమాల్లో ఉంది. 1925లో కాకోరీ కుట్ర నిందితులకు 1927లో శిక్షలు పడ్డాయి.

విప్లవమార్గాలను అభిమానించే ఉద్యమకారులందరూ 1928 సెప్టెంబరు 8—9, తేదీల్లో ఢిల్లీలోని ఫిరోజ్‌షా తుగ్లక్‌కోట శిధిలాలలో సమావేశమైనారు.

ఈ సమావేశ కర్తలు భగత్, శివవర్మ, విజయకుమార్ సిన్హా.

ఆజాద్ రహస్య జీవితం గడుపుతున్నాడు. అప్పుడుఅతన్ని పిలవటానికి భగత్‌సింగ్ శివవర్మలు వెళ్ళారు. అతడు రాలేదు కాని సంస్థలో చేరుతానని సంస్థ నిర్ణయాలకు కట్టుబడి ఉంటాననీ అన్నాడు.

సాయుధ పోరాటం ద్వారానే స్వరాజ్యం సాధ్యమని ఆ సమావేశంలో పాల్గొన్న వారందరూ పూర్తిగా విశ్వసించారు. అది సాధించేందుకు కార్యక్రమం ఏర్పాటు చేసుకోవటానికే ఆ సభ.

ఇంచుమించు ఉత్తర భారతదేశపు విప్లవ సంస్థల సభ్యులందరూ కలుసుకున్నారు. బెంగాళ్ 'అనుశీలన సమితి'వారి గొంతెమ్మ కోర్కెలను విని వదిలేశారు. పంజాబ్ జయచంద్ర విద్యాలంకార్‌ను, యు. పి. లోని కె. బి. సన్యాల్‌ను కావాలనే పిలవలేదు. వారు వాక్శూరులు క్రియాశూన్యులు కాబట్టి.

నూతన సంస్థ ఒకటి ఆవిర్భవించింది. దానిపేరు 'హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్‌ఆర్మీ' (భారత సామ్యవాద ప్రజాతంత్రసేన) అని నిర్ణయించారు. ఆజాద్ వాళ్ళ గత సంస్థ కంటె అధికంగా ఇందులో సోషలిస్టు, ఆర్మీ, పదాల ప్రయోగం ప్రత్యేకంగా గమనించతగ్గది. వాటితో సంస్థ ఆదర్శం వ్యక్తమౌతున్నది. ఆ పదాల సూచించింది భగత్‌సింగ్.

ఆ సమావేశానికి హాజరైనవారు —

పంజాబ్ నుండి — భగత్‌సింగ్, సుఖదేవ్.

యు. పి. నుండి — శివవర్మ, రాజగురు, జయదేవ్, విజయకుమార్ సిన్హా, బ్రహ్మదత్త మిశ్రా, సురేంద్రనాథ పాండే.

బీహార్ నుంచి — ఫణీంద్రనాథ్ ఘోష్, మన్‌మోహన్ బెనర్జీ.

రాజపుటానా నుంచి — కుందన్‌లాల్ మొ॥ వారు.

ప్రాంతీయ కార్యకర్తలను ఎన్నుకున్నారు.

ప్రధాన కార్యసమాలోచనకు నిర్ణయాలకు ఏడుగురు సభ్యులతో ఒక కేంద్రకమిటీ ఏర్పడింది. వారి పేర్లివి. 1. భగత్‌సింగ్ 2. ఆజాద్ చంద్రశేఖర్ 3. సుఖదేవ్. 4. శివవర్మ 5. విజయకుమార్ సిన్హా 6. ఫణీంద్రఘోష్, 7. కుందన్‌లాల్.

సంస్థకు అధ్యక్షుడు- సర్వసేనాని ఆజాద్ చంద్రశేఖర్. ఆజాద్‌ను అందుకు ఎన్నుకున్నందుకు కారణం యశపాల్ 'సింహావలోకన్'లో ఇలా వ్రాసాడు.

"చంద్రశేఖర్ ఆజాద్ వెనుకటి విప్లవ సంఘాల్లోనూ, వాటి కార్యక్రమాల్లోనూ పాల్గొన్నాడు. అప్పట్లో ఆయుధాలు ప్రయోగించే పద్ధతి కూడా మా అందరి కంటె అతనికే బాగా తెలుసు. అయినప్పటికి తాను అనుభవం కలవాడినన్న గర్వం లేకుండా మాతో కల్సి పని చేయటానికి సిద్ధం అయ్యాడు. చంద్రశేఖర్ ఆజాద్‌ను మా సంఘం తరఫున జరిగే సాయుధ పోరాటాలకు నాయకునిగా నిర్ణయించారు. అతడు మా విప్లవ సంస్థకు కమాండర్-ఇన్-చీఫ్."

సంస్థ తీసుకున్న మొదటి నిర్ణయం సైమన్ కమిషన్‌ను వ్యతిరేకించాలని.

# సైమన్ కమీషన్ కు వ్యతిరేక ప్రదర్శన

సర్ జాన్ సైమన్ అధ్యక్షతన బ్రిటిష్ ప్రభుత్వం ఒక బృందాన్ని భారతదేశం పంపిస్తున్నది. వారు దేశంలోని వివిధ ప్రధాన నగరాలలో సంచరించి ప్రజాభిప్రాయాలను సేకరించి పరిశీలించి భారతీయులకు స్వతంత్ర్యం ఇవ్వవచ్చునో లేదో నిర్ణయిస్తారట. వారు ఇచ్చే స్వాతంత్ర్యం బ్రిటిష్ సార్వభౌమత్వానికి లోబడి ఉండే రీతిలోనే సుమా. ఆ కమిటీలో తమ నాయకుల కొందరిని చేర్చు కోవాలన్న కోరికను వారు తిరస్కరించినందుకు అలిగి కాంగ్రెసు వాళ్ళు సైతం ఆ కమిషన్ను నిరసించ పూనుకున్నారు.

దేశం మాది. దీన్ని పరిపాలించే హక్కు మాది. మధ్యన బ్రిటిష్ వాళ్ళెవ్వరు నిర్ణయాలకు- అని 'సైమన్ గో బ్యాక్' నినాదంతో సంపూర్ణంగా వ్యతిరేకించ పూనుకుంది హిందూస్థాన్ సామ్యవాద ప్రజాతంత్ర సేన.

ప్రజల కార్మికుల హక్కులను కాలరాచే "రౌలత్ చట్టం" సందర్భం లోనూ 1919లో ప్రభుత్వానికి గట్టి నిరసన దేశంలో కన్పించింది. జలియన్ వాలాబాగ్ (అమృతసర్) హత్యాకాండ అప్పటిదే. ఇప్పుడు మళ్ళీ అదే ఊపు ప్రజల్లో చేరింది.

8 ఫిబ్రవరినాడు బొంబాయిలో, ఆతర్వాత మద్రాసు, లక్నో మొదలైన అనేక నగరాల్లో నల్లజెండాలతో నిరసన ప్రదర్శనలు జరిగినవి.

లాహోర్ లో 20 అక్టోబరు నాడు నిర్వహించిన నిరసన ప్రదర్శన ఊరేగింపునకు పంజాబ్ కేసరి లాలాలజపతిరాయి ముందు నిలిచాడు. ఆయన పిలవటంతో లక్నో నుంచి వచ్చి మదన్ మోహన్ మాలవ్యా కూడా తోడుగా నిలిచాడు. విప్లవకారులు కాంగ్రేసు వాళ్ళకు ముందున్నారు. ఆ ప్రదర్శన

గొప్పది. చరిత్రాత్మకమైంది. పోలీసులు ప్రజలను చెదరగొట్టడానికి లాఠీ చార్జి చేశారు. లాలాజీ ఆ దెబ్బలతో తీవ్రంగా గాయపడ్డాడు.

ఆనాటి సాయంత్రం "మోరీ దర్వాజా" దగ్గర జరిగిన బహిరంగ సభలో లాలాజీ తీవ్రంగా ఉపన్యసించాడు.

"నామీద పడిన ఒక్కొక్క దెబ్బ బ్రిటిష్ పాలకుల శవ పేటికలపై బిగించు ఒక్కొక్క మేకు. నేను నిశ్చయంగా చెప్తున్నాను. నిరాయుధులైన ప్రజలను క్రూరంగా హింసిస్తున్న ఈ ప్రభుత్వం ఇంకా ఎంతోకాలం నిలవదు. ఈ దుశ్చర్యలే వాళ్ళను సర్వనాశనం చేస్తాయి" అన్నాడు.

ఆ గాయాల బాధవల్ల 17 నవంబర్ 1928 దినాన ఆయన కీర్తిశేషుడయినాడు.

# సాండర్స్ హత్య

లాలాజీ దేశ రాజకీయాలలో మంచిపేరు గడించిన వృద్ధ నాయకుడు. ఆయన అకాల మరణానికి దేశంయావత్తూ శోకక్రోధాలతో నిండిపోయింది.

కీ.శే. చిత్తరంజన్‌దాస్ సతీమణి బసంతీదేవి లాలాజీ స్మారక సభలో ప్రసంగిస్తూ "ఒక ప్రముఖ దేశనాయకుని నడిరోడ్డుపై కొట్టి చంపితే, దేశంలోని అందరినీ అవమానపరచితే ఈ దేశంలోని యువకులంతా ఏమైనారు" అని ప్రతీకారం కోసం హెచ్చరించడం, క్రాంతికారులకు కర్తవ్యం బోధించినట్లయింది.

హి.సా.ప్ర. సేన అత్యవసర సమావేశాన్ని జరిపింది. ఆ సమావేశానికి ఆజాద్ అధ్యక్షుడు. డిసెంబర్ 10నాటి ఆ సమావేశంలో పాతవారితో పాటు నూతన విప్లవకారులు కూడా పలువురు పాల్గొన్నారు.

ఈ లాహోరు హింసకుకారకులు లాహోర్ పోలీస్‌సూపరింటెండెంట్

జె.ఎ. స్కాట్, డి. ఎస్. పి.సాండర్స్. ఆ ఇద్దరినీ కనీసం ఒక్కరినైనా మట్టు పెట్టాలని నిర్ణయం తీసుకున్నారు.

విప్లవ సంఘం కార్యరంగంలో దిగింది. లాహోర్, మగంజ్ పేటలోని ఓయింటిని అద్దెకు తీసుకున్నారు. పోలీసు ఆఫీసర్ల రాకపోకలను ప్రత్యేకంగా గమనించసాగారు.



డిసెంబర్ 17నాడు ప్రత్యక్షచర్యకు పూనుకున్నారు. పోలీస్ స్టేషన్ బయటి రోడ్డుమీద సైకిల్‌ను బాగుచేసుకుంటున్నట్లుగా జయగోపాల్ నిలుస్తాడు.

పోలీస్ ఆఫీసర్ రాకనుచూసి అతడు మిత్రులకు తెలియపరచాలి. ఎప్పుడూ ఎర్రటి సైకిల్ మోటారుపై పోతుంటాడు సాండర్స్. ఆ సైగచూసి వెంటనే ఆ వ్యక్తిని భగత్‌సింగ్, రాజగురు కాల్చాలి. ఒకవేళ అతడు తప్పించుకొని పారిపోతే జయగోపాల్ తన సైకిల్‌ను అడ్డుపెడతాడు. వెంటపడి కాలుస్తాడు భగత్.

ఇదీ పథకం. ఆజాద్ ఆ సమీపంలోని డి.ఎ.వి.కాలేజి ఆవరణలో దాగి ఉన్నాడు. ఆయనవద్ద మౌజరు పిస్తోలు ఉంది. అది పదిగుండ్లది. తుపాకి కంటె ఎక్కువ దూరం కాలుస్తుంది. కాల్పులు జరిపి వచ్చిన మిత్రులను తప్పించడం అతని పని. పోలీసులు హంతకులను వెంబడించివస్తె అటకాయించి నిలపాలి.

అనుకున్నట్లుగా విప్లవకారుల కాల్పులకు నడిరోడ్డుపై కుక్కచావు చచ్చాడు సాండర్స్. పరుగెత్తుతున్న క్రాంతికారులను ఒక ట్రాఫిక్ ఇన్స్పెక్టర్ మరోయిద్దరు పోలీసులు వెంబడించారు.

'ఖబర్దార్ ఆగిపోండి' అని హెచ్చరించాడు ఆజాద్. అతని చేతిలో పిస్తోల్ గురిపెట్టబడి ఉంది. అడుగు ముందుకేసిన సిపాయి చందన్‌లాల్ నేల కరిచాడు.

ఆ వెంటనే ఆజాద్, రాజగురును సైకిల్‌పై ఎక్కించుకొని పారి పోయాడు. అంతకుముందుగనే పరుగుదీసారు భగత్‌సింగ్, జయగోపాల్.

ఎవరో దుండగులు చేసిన అనాలోచిత చర్యగా కాకుండా తామెవరో ఎందుకు ఈహత్య చేశారో తెలిపే కరపత్రాలను, వాల్‌పోస్టర్స్‌ను ముందే సిద్ధం చేసి ఉంచారు. అదేరాత్రి భగత్‌సింగ్ అతిసాహసంగా ప్రధాన కూడలులలో పోస్టర్స్ అంటించి వచ్చాడు. కరపత్రాలు వీలైనచోటనెల్లా విడిచారు. వాటిలోని అంశాలు గమనించదగినవి.

"హిందూస్థాన్ సామ్యవాద ప్రజాతంత్ర సేన.

నోటీస్——

సామ్రాజ్యవాదులారా జాగ్రత్త!

జె.పి. సాండర్స్‌ను వధించి లాలాలజపతిరాయ్ హత్యకు ప్రతీకారాన్ని తీర్చుకున్నాం. ఒక పోలీసుఉద్యోగి ముప్పదికోట్ల ప్రజలచే గౌరవింపబడే ఒక ప్రజానాయకుని కొట్టడం, అతని ప్రాణాలను పొట్టనపెట్టుకోవడం శోచనీయమైన విషయం; ఎంతో దుఃఖదాయక స్థితి. ఇది భారత యువకులకో సవాల్!

భారత ప్రజలు శవాలు కారని వారిలోనూ వేడిరక్తం ఇంకా ప్రవహిస్తూనే వుందని, ఈనాడు ప్రపంచానికి చాటాం. భారతదేశ గౌరవం కోసం యువకులమైన మేము మా ప్రాణాలను అర్పించడానికి సిద్ధంగా వున్నాం. దేశ గౌరవాన్ని నిలబెట్టడానికి, ప్రాణాలను తెగించే మేమీ సాహసానికి పూనుకొన్నాం.

ఓ దుష్టప్రభుత్వమా జాగ్రత్త!

బాధామయ జీవులైన ఈ దేశప్రజలను నొప్పించకు. నీ క్రూరకృత్యాలను విడిచిపెట్టు. మేము ఆయుధాలను ధరించకుండా వుండగలందులకు నువ్వు ఎన్నో జాగ్రత్తలను తీసుకుంటున్నావు. నిశేధాలను అమలుపరుస్తున్నావు. అయినా ఈదేశ ప్రజలకు ఆయుధాలు లభిస్తూనే ఉంటాయి. రివాల్వర్లనీ, పిస్తోళ్ళనీ సంపాదించుకుంటూనే వుంటారు! ఈ కొద్ది ఆయుధాలు సాయుధ విప్లవానికి సరిపడక పోవచ్చు. కాని, జాతికి జరిగిన అవమానాలకు బదులు తీర్చుకోవటానికి మాత్రము తప్పక సరిపోతాయి.

మా నాయకులే మమ్మ నిందించనీ, పరప్రభుత్వం మమ్మల్ని ఎంతగానైనా తూలనాడనీ, అయినా జాతిగౌరవాన్ని నిలబెట్టేందుకు సదా సిద్ధంగాఉంటాము. ఆత్మీయుల నిందలనూ, క్రూరప్రభుత్వ హింసలనూ సహిస్తూ కూడా- ఉరికంబాలను ఎక్కుతూ కూడా- మేం సంపూర్ణ మానవత్వమైన చైతన్యంతో నినదిస్తాం.

ఇన్క్విలాబ్ జిందాబాద్.

ఒక మానవున్ని వధించినందుకు మేము చాల దుఃఖపడుతున్నాం. కాని ఇతడు దుష్ట ఆంగ్లప్రభుత్వ శరీరానికి ఒక అంగం! ఈ దుష్టప్రభుత్వాన్ని అంతం చేయడం అవసరం. మేం ఈ మనిషిని భారతదేశంలోని బ్రిటిష్ ప్రభుత్వ ఉద్యోగి కావటంవల్లనే హత్యచేశాం. బ్రిటిష్ ప్రభుత్వం ప్రపంచ ప్రభుత్వాలన్నింటికంటె క్రూరమైనది.

మానవరక్తాన్ని ప్రవహింప జేసినందుకు మేం చింతిస్తున్నాం. కాని, క్రాంతిని ఆహ్వానించినప్పుడు మానవరక్తాన్ని చిలికించక తప్పదు.

ఒక మానవున్ని మరోమానవుడు దోచుకోవడానికి వీలులేని న్యాయ సమ్మతమైన సాంఘిక రాజకీయ వ్యవస్థ కోసం మేం విప్లవ మార్గాన్ని స్వీకరిస్తున్నాం.

విప్లవం వర్థిల్లాలి!

సం॥ బలరాజ్,

8 డిసెంబర్ 1928, సేనాపతి-పంజాబ్,

హి.సా.ప్ర.సే.

బలరాజ్ అనేది ఆజాద్‌కు మారుపేరు. ఈ ప్రకటనతో ఆంగ్ల ప్రభుత్వానికి జడుపు పుట్టింది. ప్రజలకు ధైర్యం కలిగింది. విప్లవకారులపై సానుభూతి పెరిగింది.

## లాహోరునుంచి పరారీ

ఈ హత్యతో లాహోరులో అరెస్టులు పెరిగాయి. విప్లవకార్యకర్తలు సత్వరం తప్పించుకొని పోవాలి. లేకుంటే ప్రమాదం ఏ క్షణమయినా సంభవించవచ్చు.

సాండర్స్‌ను చంపిన తర్వాత ప్రయాణానికి డబ్బులేదు సరికదా. ఆ రాత్రి వారికి భోజనానికే లేదు. పార్టీ వ్యక్తుల తిండితిప్పల విషయంలో ఆజాద్‌కు శ్రద్ధ అధికం. ఆయన కోరికగా జయగోపాల్ వెళ్ళి ఎక్కడో పదిరూపాయలు అడిగి తెస్తే, హోటల్ నుంచి ఆహారపదార్థాలు తెచ్చుకొని అందరూ సర్దుకొని తిన్నారు.



యశపాల్ తాను ఉద్యోగం చేసే గోపిచంద్ భార్గవ వద్ద 200రూ॥ అడిగి ఇచ్చాడు. సుఖదేవ్ వెళ్ళి దుర్గాదేవి వద్ద 500రూ॥ తీసుకొచ్చాడు.

డబ్బు సమకూరటంతో ఎక్కడివాళ్ళక్కడే పరారీఅయ్యారు. ఆజాద్ భగత్‌సింగ్ పోలీసుల దృష్టినుండి తప్పించుకొని పారిపోవటం కష్టంగా ఉంది.

"నా సంగతి నేను చూసుకుంటాను- కాని, భగత్ విషయంలో మీరు చూసుకోండి" అన్నాడు ఆజాద్.

సుఖదేవ్ వెళ్ళి దుర్గాదేవి సహాయం అర్థించగా ఆమె అందుకు అంగీకరించింది. భగత్‌సింగ్ హాట్ సూట్ వేశాడు. గడ్డం కొరిగి సన్నటి మీసాల్తో అచ్చం దొరబాబులా తయారయ్యాడు. నాగరికమైన దుస్తుల్తో అతని భార్యగా మూడేళ్ళ కొడుకు శచితో పాటు అతని వెంట దుర్గాదేవి బయల్దేరింది. అప్పుడామె భర్త భగవతిచరణ్ మీరట్ కుట్రకేసు వారెంటు కారణంగా కలకత్తాలో సుశీలా దేవి వద్ద ఉంటున్నాడు. సుశీల లాహోరులోని అధ్యాపిక ఉద్యోగం వదలివెళ్ళి కలకత్తాలో ఒక ధనికుని కూతురుకు ట్యూషన్ చెప్పుతూ వుంటున్నది. వీళ్ళు కలకత్తాకే బయల్దేరారు. పెట్టె వేడా తీసుకొని నెక్కరు ముతక చొక్కా ధరించి వారి నౌకరుగా రాజగురు అనుసరించాడు.

ఇటువీళ్ళు ఇంత ప్రయాసపడితే, అటు రామనామాంకితమైన పసుపు రంగు ఉత్తరీయాన్ని కప్పుకొని సాధువేషంలో అదే రైల్లో ప్రయాణం చేశాడు ఆజాద్.

అతన్ని చూసి కొంతసేపటికి పోల్చుకొని "అరె! పండిట్‌జీ!" అని ఆశ్చర్యం వెలిబుచ్చాడు భగత్‌సింగ్. అంతటి సమయోచిత యుక్తిపరుడు ఆజాద్.

## ఆగ్రాలో బాంబుల నిర్మాణం

కేంద్ర సంఘం 'ఆగ్రా' పట్టణంలో బాంబుల నిర్మాణం తలపెట్టింది.

రెండు వీధుల్లో రెండు ఇండ్లు అద్దెకు తీసుకున్నారు. సుఖదేవ్, కుందన్‌లాల్ ఆ విద్యలలో నేర్పరులు.

కలకత్తా నుంచి యతీంద్రనాధ్ వచ్చాడు సహాయకుడుగా.

సాండర్స్ హత్య కారణంగా ప్రజలు అనేకులు క్రాంతికారుల ఉద్యమానికి ఉదారంగా సహకరించ సాగారు, రహస్యంగానైనా.

ఇక్కడ వున్న రోజుల్లో ఆజాద్ మిత్రులతో కులాసాగా గడిపేవాడు. మంచి ఆంగ్ల పుస్తకాలు చదివించుకొని వినేవాడు కసరత్తు చేసేవాడు- చేయించేవాడు. తీరిక సమయాల్లో బుందేల్‌ఖండ్ అడవుల్లోకి వెళ్ళి పిస్తోలు గురిచూసి పేల్చడం కార్యకర్తలకు నేర్పేవాడు. తాను సాధన చేసేవాడు. అతనికది అత్యంత ప్రియమైన విషయం. హుషారుగా వేటాడేవాడు. తాను మాంసం తినకున్నా మిత్రులకు ఆ మాంసం పనికివచ్చేది.

స్త్రీల విషయంలో ప్రసంగించడానికి విముఖుడు. స్త్రీల యెడల అసభ్యంగా మెదిలే వారిని క్షమించేవాడు కాదు.

వివిధ ప్రాంతాల కార్యకర్తలకు బాంబుల తయారీ నేర్పించిన తర్వాత ముకాం ఆగ్రా నుంచి ఢిల్లీకి మార్చారు. సుఖదేవ్ లాహోరులో, శివవర్మ యు. పి.లో బాంబుల నిర్మాణం చేపట్టారు.

## ఢిల్లీ అసెంబ్లీలో బాంబు ప్రయోగం

1929 వసంతకాలపు సమావేశంలో ఢిల్లీ అసెంబ్లీ (అదే ఇప్పటి పార్లమెంటు)ఆంగ్ల ప్రభుత్వం రెండు కొత్త చట్టాలను ప్రవేశపెట్టబోతున్నది.

1. ప్రజా భద్రత చట్టం (Public Safty bill)

2. కార్మిక హక్కుల రద్దు చట్టం (Trrdes Disputas Bill)

ప్రతిపక్ష నాయకులు అంగీకరించకపోయినా వైస్రాయి తన ప్రత్యేక అధికారంతో ఆమోదముద్ర వేయబోతున్నాడు. ఇవి ప్రజల-కార్మికుల హక్కుల భంగపరచేవి. అందుకని అదే సమయంలో తమ అసమ్మతిని తెలపాలని విప్లవ సేన భావించింది.

బాంబులు తయారైనవి. అనేక తర్జన భర్జనల అనంతరం భగత్‌సింగ్ బటుకేశ్వర దత్తు (ఇతడు కాకోరీ చర్యలో ఆజాద్ సహచరుడు) యాక్షన్‌కు వెళ్ళడానికి నిర్ణయమైంది.

ఆజాద్‌కు స్వయంగా వెళ్ళాలని ఉంది. కాని సంఘ నాయకుడు కార్యనిర్వహణకు వెళ్ళి ప్రమాదంలో చిక్కుపడితే ఉద్యమం కుంటుపడుతుందని సభ్యులు అంగీకరించలేదు. ఇంతవరకు కాకోరీ రైలు దోపిడీ, సాండర్స్ హత్యల్లో ఆయన స్వయంగా పాల్గొన్నాడు. పిరికితనం, భయం ఆజాద్‌కు ఎంతమాత్రం లేవు. అతడు బహుఆలోచనా పరుడు. ధైర్యశాలి.

అసెంబ్లీలో బాంబు వేసిన తర్వాత మిత్రులను విడిపించే బాధ్యతలు ఆజాద్ స్వయంగా తనపై వేసుకొన్నాడు. పిస్తోల్ ప్రయోగించడంలో అతడు దిట్ట. పైగా కారు డ్రైవింగ్ అప్పటికి పార్టీలో అతనికొక్కనికే తెలుసు. కాని, బాంబు వేసినవాళ్ళు ధైర్యంగా ప్రభుత్వానికి పట్టుపడాలి. నిర్భయంగా తమ ఆదర్శాలను చాటాలి, అని పార్టీ నిర్ణయం. పార్టీ ఆదేశాన్ని ఎన్నడూ ధిక్కరించే వాడు కాదు ఆజాద్ తాను ముఖ్యమైన అధ్యక్షపదవిలో ఉన్నా.

ఒకటి కాదు రెండు బాంబులు ప్రయోగించారు. ఎవరికీ ప్రమాదం

లేకుండా, ప్రభుత్వ పక్షపు అధికారి జాన్ సువర్టు భయంతో గజగజలాడిపోయి బల్ల క్రింద దాక్కున్నాడు.

విప్లవం వర్ధిల్లాలి. సామ్రాజ్యవాదం నశించాలి. నినాదాలతో పాటు ప్రేక్షకుల గ్యాలరీ నుండి ఎర్రని కరపత్రాలు వెదజల్లి ధైర్యంగా అరెస్టయి పోలీసుల వెంట నడిచారు భగత్, భటుకేశ్వర దత్తులు.

వారిని విడిపించే వీలుండీ, విడిపించలేక పోయినందుకు ఆజాద్ మనస్సు ఎంతగానో వ్యధ చెందింది. తప్పించుకొనే అవకాశముండీ పార్టీ ఆదేశాన్ని శిరసావహించి బందీలైన ఆ క్రాంతికారుల దెంతటి సాహసం!

కరపత్రంలో—

చట్టాల ముసుగులో ప్రజలను ప్రభుత్వం అవమానిస్తున్న చర్యలకు నిరసనగా తాము బాంబులు ప్రయోగించామని,

ఈ ప్రభుత్వదమన నీతికి వ్యతిరేకంగా తమవలె బాధ్యతను గుర్తించి సైన్యం కూడా ఎదురు తిరగాలని,

ప్రజా ప్రతినిధులు పదవులు అనే మోసపు ఆకర్షణకు లోబడక తమ తమ నియోజక వర్గాలకు వెళ్ళి ప్రజలను విదేశీ దుష్టప్రభుత్వంపై యుద్ధానికి సన్నద్ధం చేయండనీ, కోరినారు.

ఇంకా ఇలాగుంది.

"మేము మానవజీవితాన్ని పవిత్రమైనదిగా భావిస్తున్నాం. ప్రతి వ్యక్తీ పూర్ణ స్వాతంత్ర్యాన్ని అనుభవించగల ఉజ్వల భవిష్యత్తును మేం ఆహ్వానిస్తున్నాం. తప్పని సరియై మానవ రక్తాన్ని ప్రవహింప జేయవలసి వస్తున్నందుకు చింతిస్తున్నాం. కాని విప్లవంద్వారా సంపూర్ణ స్వేచ్ఛను, ఒక

మానవుడు మరో మానవునిదోచుకునే వీలులేని సమసమాజాన్ని నిర్మించేటప్పుడు ఎంతో కొంత రక్తం అనివార్యమౌతుంది.

విప్లవం వర్ధిల్లాలి.

సం॥ బలరాజ్,

8 ఏప్రిల్ 1929, కమాండర్ ఇన్ చీఫ్

(హి. సా. ప్ర. సమితి)

## అరెస్టులు - అలజడులు

దీనితో పెద్ద యెత్తున ప్రభుత్వం పోలీసు బలగాన్ని కార్యరంగంలో దించింది. విప్లవ కారులకోసం తీవ్రమైన గాలింపు మొదలైంది. అనుమానం వచ్చిన వారినందరినీ కటకటాల వెనుకకు త్రోయసాగారు.

ఏప్రిల్ 13 రాత్రి లాహోర్ ఫ్యాక్టరీ పట్టుపడింది. సుఖదేవ్, జయ గోపాల్, కిశోరీలాల్ దొరికిపోయారు.

మే 14 నాడు షహారన్‌పూర్ ఫ్యాక్టరీ వశమైంది. శివవర్మ, జయ దేవ కపూర్, ఇంకా డా॥ గయాప్రసాద్ బందీలయినారు.

ఫణీంద్రనాధ్ దొంగచాటుగా పెళ్ళి చేసుకొని కలకత్తాలో అత్తవారింట పోలీసులకు దొరికి లొంగిపోయి పార్టీ రహస్యాలు చాలావరకు వెల్లడి చేశాడు. ఆ కారణంగా యతీంద్రనాథ్, కమల్‌నాథ్ తివారి, వైద్యనాథ సింహ, సురేంద్ర పాండే, మోహన్ బెనర్జీలు అరెస్టయినారు.

ఆజాద్ పోలీసులకు పట్టుపడకుండా తప్పించుకొని వెళ్ళి ఝూన్సీ, గ్వాలియర్, కాన్‌పూర్‌లలో రహస్యంగా ఉంటున్నాడు.

మిత్రులు చెదరిపోయారు, అరెస్టులు పెరిగిన కారణంగా ప్రజల తోడ్పాటు తగ్గిపోయింది. సంస్థను నడిపించడం చాలా కష్టంగా ఉంది. ఆర్థికంగా ఒత్తిడి అధికమైంది. చందాలకు ప్రయత్నిస్తూనే అప్పులుచేసి కూడా పార్టీని నడిపించుతున్నాడు.

అటు భగత్ వీరులు న్యాయస్థానంలో ధైర్యంగా నిలబడి తమ విప్లవ సంస్థ ధ్యేయాలను చాటుతున్నారు. ఆ వీరుల ఫోటోలను వారి ప్రసంగాలను పత్రికల్లో ప్రచురిస్తుండగా ప్రజలు వాటిని చదివి ఉత్తేజితులౌతున్నారు. విప్లవంపై అభిమానం విప్లవ వీరులపై ఆరాధనా భావం పెంచుకుంటున్నారు,

భగత్, దత్తుల ఫోటోను ఒక క్రాంతికారుడు తెచ్చి చూపించినప్పుడు ఆజాద్ విచారంతో అన్నాడిలా.

"సేనాని స్థానంలో ఉండి నేను చేస్తున్న దేమిటి? నూతన మిత్రులను పరిచయం చేసుకోవటం, వారిని మృత్యుముఖంలోనికి పంపిస్తూ నేను ఉండడమా."

బాధ్యత ఆయనను కఠినంగా మార్చినా గుండెలో అంతటి కరుణ నిండి వుండేది. దేశ విముక్తికోసం ఎంత చేదును భరించాడాయన.

## భగవతీచరణ్ కలయిక

ఆ సందర్భంలోనే భగవతీచరణ్ తనను కలవటానికి వచ్చి, సంస్థకు సహకరిస్తానని (అప్పటికి 506 రూ॥లు) వాగ్దానంచేశాడు. జయచంద్ర విద్యాలంకార్ మాటలవల్ల చరణ్‌ను విశ్వసించలేకపోయాడు ఆజాద్. పైగా తొందరపాటుతో సంస్థను చిక్కులపాలు చేయటం అతనికి ఇష్టంగా లేదు. అంతవరకే

పార్టీ చాలా దెబ్బతిన్నది. మంచి విప్లవకారులని నమ్మేవాళ్ళే ప్రభుత్వానికి లొంగిపోతున్నారు. అటువంటి దశలో మనస్సు కొత్తవారిని విశ్వసించే స్థితిలో లేదు. "నాకు మీ సహకారము వద్దు, సంబంధమూ వద్దు" అని నిర్మొహమాటంగా చెప్పి పంపాడు.

యశపాల్, భగవతిచరణ్ వైస్రాయి ట్రేన్ క్రింద బాంబు పేల్చాలనే ప్రయత్నంలో ఉండి, ఆ సమయంలో ప్రచురించే కరపత్రం కేంద్ర విప్లవ సేన అధ్యక్షుడు ఆజాద్ పేర ఉండాలనే కోరికతో ఉన్నారు. గణేశశంకర విద్యార్థివల్ల 24 అక్టోబర్ యాక్షన్ వాయిదా పడింది.

భగవతి చరణ్ ప్రయత్నంవల్ల బందీగా ఉన్న జయదేవకపూర్ ద్వారా ఢిల్లీ ప్రతినిధి కైలాసపతి పరిచయం కలిగింది. ఖైదీల సమాచారం తెల్సుకొనడానికి వచ్చిన ఆజాద్ అనుచరుడు విశ్వనాధ వైశంపాయన బచ్చన్ ద్వారా "భగవతిభాయి నమ్మక పాత్రుడు, త్యాగశీలి, నిజమయిన విప్లవకారుడు" అని కైలాసపతి చెప్పి పంపాడు.

తన విశ్వాసాలు నిరాధారమైనవని తోచినప్పుడు వాటిని మార్చుకోవటానికి వెనుకాడేవాడు కాదు ఆజాద్. అతనికి ఉద్యమాన్ని బలంగా నడిపించడం ముఖ్యం. ఉత్సాహపరులు అందించే సహకారాన్ని వీలైనంతగా అందుకు వినియోగించుకునేవాడు.

ఒకనాడు సాయంత్రం ఢిల్లీలోని కుదిసియా తోటలో ఆజాద్, బచ్చన్‌తో వెళ్ళి భగవతిచరణ్, యశపాల్‌లను కల్సుకున్నాడు. కైలాసపతి ఉన్నాడు.

"సోదరులారా! నేను విన్న విషయాలను బట్టి ఇదివరకు అలా

మెడలొల్సివచ్చింది. అదంతా మరచిపోండి. ఇప్పుడు మనస్ఫూర్తిగా నా స్నేహాన్ని అందిస్తున్నాను." అని ప్రేమతో ఆహ్వానించాడు.

వాళ్ళు అతని ప్రవర్తనకు ముగ్ధులైనారు. ఇంతవరకే బాంబు పేల్చే వారమని, కాంగ్రెసు సంప్రదింపులు అయ్యేంతవరకు వైస్రాయికి ప్రమాదం కల్గించకండని గణేశశంకర్‌జీ కోరటంవల్ల ఆగవల్సిందని చెప్పాడు భగవతిచరణ్.

భగత్‌సింగ్‌కు వ్యతిరేకంగా ప్రభుత్వం తరఫున వాదిస్తున్న న్యాయవాదుల్ని తుదముట్టించాలనే కోరికతో తనున్నట్లు ఆజాద్ తెలిపాడు.

ఉద్యోగులను చంపటం కోసం సమయాన్ని వెచ్చించటంకన్న అదే ప్రయత్నంలో ప్రభుత్వంపై దెబ్బతీయటం మంచిదనే అభిప్రాయం వ్యక్తంచేశాడు యశపాల్.

అంగీకరించాడు ఆజాద్.

నవంబర్ చివరి వారంలో బాంబుప్రయోగానికి అంగీకారం కుదిరింది. కరపత్రం పంపిణీ అవసరం గుర్తించారు.

తానప్పుడు ఢిల్లీలో యమునదగ్గరి 'న్యూహిందూహాస్టల్' సూపరింటెండెంట్ 'నందకిషోర్ నిగమే' ఇంటిలో కైలాసపతితోపాటు ఉంటున్నట్లుతెలిపాడు ఆజాద్.

నవంబర్‌లో బాంబుపేల్చలేకపోయారువాళ్ళు. నిర్ణయం 23 డిసెంబర్‌కు మారింది. కాని ఆనాడే గాంధీజీ వైస్రాయి ఇర్విన్‌తో చివరి సంప్రదింపులు జరిపి. అవి విఫలమైతే ఉద్యమం ఆరంభించే నిర్ణయం 24 నుంచి జరిగే లాహోరు కాంగ్రెసు సభల్లో తీసుకోవటం జరుగుతుందట. జవహర్‌లాల్ కాంగ్రెసు అధ్యక్షుడైతే పరిస్థితిలో మార్పురావచ్చునని. ప్రస్తుతానికి వైస్రాయికి ప్రమాదం కలిగించవద్దనే అభ్యర్థన ఆజాద్‌కు వచ్చింది.

అత్యవసరంగా కలుసుకొమ్మని కబురుపంపించి ఇప్పటికి బాంబు ప్రయోగాన్ని వాయిదా వేయాలనే కాంగ్రెసు మిత్రులకోరికను తెలిపాడు ఉద్యమ మిత్రులు రాగానే.

కాంగ్రెసు రాజీబేరాలను చూస్తూ నడవవల్సిన అవసరం మనకేముందని చరణ్, యశ్‌పాల్ వాదన.

"ఒకసారి కాంగ్రెసువారి మాటను అంగీకరించాం. మళ్ళీ మళ్ళీ అదే దారి అంటే నిజంగానే బాగుండదు. మనం వారిచేతి కీలుబొమ్మలం కారాదు. కాని ముందు వెనుకలాలోచించక కార్యరంగంలో దూకవద్దు. కాంగ్రెసు రాజీబేరాలకు మన రాజకీయ ఉద్యమాలకు సంబంధం లేదు. బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రండి" అన్నాడు ఆజాద్.

యాక్షన్ నిలిపివేయాలనే ఇతరమిత్రులు తీర్మానించారు. కరపత్రం సంస్థ ముద్రను చరణ్ ఆజాద్‌కిచ్చేశాడు.

మూడు నాలుగుమాసాల కృషితో బాంబుప్రేల్చటానికి అన్నియేర్పాట్లు అంతకుముందే జరిగాయి. మాటిమాటికి తమప్రయత్నం ఆపితే మిత్రుల్లో పిరికి వారమనే ముద్రపడుతుందని సహచరులు ముఖ్యంగా యశపాల్ ఒత్తిడిచేయడంతో అంగీకరించక తప్పలేదు భగవతీచరణ్‌కు.

మధుర ఢిల్లీలైనులో పాండవుల ఖిల్లావద్ద వైస్రాయి ట్రేన్ క్రింద బాంబుపేల్చాడు యశ్‌పాల్ బాగ్‌రాంతోవెళ్ళి చరణ్ అనుమతితో డిసెంబర్ 23 నాడు ఉదయం.

ఒక కంపార్టుమెంట్ దెబ్బతిన్నది. వైస్రాయి సెకరెట్రీగాయపడ్డాడు. ఒక బంట్రోతు చచ్చాడు. వైస్రాయి బెదరిపోయాడు. భారతదేశంలోనే అసెంబ్లీ బాంబు తర్వాత అదో సంచలనవార్త అయింది. విప్లవకారుల బలం వెల్లడయింది. కాని, పార్టీ ఆదేశాలకు భిన్నంగా మెదలినందుకు ఆజాద్‌కు కోపం వచ్చింది.

# యశ్ పాల్ సంజాయిషీ

నాయకుడు కోపగించుకుంటాడని తెల్సు. అందుచేత భగవతీచరణ్ ముందుగా వెళ్ళడం బాగుండదని చెప్పి, యశపాల్ స్వయంగా చొరవ తీసుకొని జనవరి 2వ తారీకున నందకిషోర్‌నిగమ్ ఇంటిలో ఆజాద్‌ను కలిశాడు.

గంభీరంగా మౌనంగా ఉన్నాడు భైయా. అది అతనికోపానికిచిహ్నం. ఇద్దరు యమునఒడ్డుకు వెళ్ళారు.

"పార్టీ ఆదేశాలకు భిన్నంగా మీరు బాంబును ఎందుకు ప్రయోగించారు?" అడిగాడు ఆజాద్.

"ఆ విషయంలో నేను అపరాధినే. అందుకు ఏ శిక్షకైనా సిద్ధంగా ఉన్నాను. భగవతిభాయి వద్దన్నా నేనేవినలేదు. కాంగ్రెసు సభలకు ముందుగా వైస్రాయ్ ట్రేన్‌క్రింద బాంబుప్రేలిస్తే ప్రజలమీద రాజకీయంగా ప్రభావం పడుతుందని ఊహించాను. నాఊహసరియైందేనని లాహోర్‌సభల్లో రుజువైందికూడా" యశపాల్ నెమ్మదిగా వివరించాడు.

కళ్ళు ఎర్రపడ్డయ్ ఆజాద్‌కు. కోపాన్ని అణచుకోవటానికి పెదవి కొరుక్కుంయా ఆగి అన్నాడు. "నీవూహ పార్టీ నిర్ణయం కంటె గొప్పదా? నీ ఆలోచనే గొప్పదనే భావం నీకుంటే ఇకపార్టీతో సంబంధమేమిటి? వెళ్ళు. నీ యిష్టమున్నట్టు చేసుకో."

తన ప్రవర్తనకు క్షమాపణకోరి, పిస్తోల్‌ను ఆజాద్ ముందుంచాడు యశపాల్. మీయిష్టం వచ్చిన శిక్ష విధించవచ్చు. భవిష్యత్తులో నమ్మకపాత్రుడిగా మెదలగలనని విశ్వసిస్తేనే క్షమించండి—అని పిస్తోల్ అతని ముందుంచాడు.

"దాన్ని ఉంచుకో నీ దగ్గరే" అన్నాడు ఆజాద్. కోపాన్ని బలవంతంగా అపుకొని, చెమర్చిన కళ్ళను దస్తీతో తుడుచుకున్నాడు. ఎంత ఆవే

శంలో ఉన్నా కఠినత మాటవైఖరిలో చూపుతాడేతప్ప. అసభ్యపదజాలం వాడటం అతని జన్మలో లేదు.

# బాంబు దర్శనం

గాంధీగారి లాహోరు ప్రసంగాన్ని Bomb cult 'బాంబుమార్గం' అనే పేరుతో గాంధీజీ తన 'యంగ్ఇండియా' పత్రికలో ప్రచురించాడు. అందులో వైస్రాయిపై భక్తి, ప్రధానంగా విప్లవకారుల ?ంద ఉంది.

దానికి జవాబుగా పార్టీపేరుతో 'బాంబు దర్శనం' పేర ఒక కరపత్రాన్ని ప్రచురించాలని భగవతీచరణ్ కోరికను తెలిపాడు యశపాల్.



అందుకు సంతోషంగా అంగీకరించాడు ఆజాద్. అదేరోజు యశపాల్ వెంటవెళ్ళి లక్నోలో భగవతీచరణ్‌ను కలిశాడు.

అనేక చర్చలు సాగించి సుదీర్ఘ కరపత్రం రచించి ప్రచురించారు. రచన భగవతీచరణ్‌ది. సహాయం యశపాల్‌ది. సలహాలు సంతకం ఆజాద్ చంద్రశేఖర్‌వి. ఈ కరపత్రంలో బలరాజ్ అనే పేరుకాక 'కర్తార్‌సింగ్' అని వాడాడు ఆజాద్.

బాంబు దర్శనం విప్లవచర్యలను సమర్థించేది, కాంగ్రెసు దళారీ రాజకీయాలను తూర్పారబట్టింది. దేశ స్వాతంత్ర్యంకోసం సాయుధ పోరాటం శరణ్యమన్నాడు. హింసకు హింస ప్రకృతి సహజలక్షణం, అహింస అనేది ఒక భ్రమ సిద్ధాంతం, దానివల్ల శత్రువులకు విజయం తమకు నష్టం అనేది చరిత్ర సాక్ష్యం సత్యమని వివరించారు. ఇంకా ప్రజలను, మేధావులను యువశక్తి విప్లవ కార్యాలకు తోడ్పడవల్సిందిగా కోరినారు,

అదో బలమైన ఆయుధమై ప్రభుత్వాన్ని గాయపరచి ప్రజలను ఉత్తేజపరచింది.

కోర్టు విచారణ సందర్భంలో భగత్ మిత్రులు ఇస్తున్న దేశభక్తితో కూడిన ఉద్రేక పూరితమైన స్టేట్‌మెంట్స్‌కు ఇది తోడయి ప్రజాభిమానాన్ని విప్లవకారులకు పెంచింది.

## క్రొత్త కార్యవర్గం ఏర్పాటు

1930 జనవరిలో విప్లవ కార్యకర్తల సమావేశం కాన్పూర్‌లో ఏర్పరచాడు ఆజాద్. దేశ స్థితిగతులు సంస్థ పూర్వపరాలను గూర్చి చర్చించారు. తాను అతి కష్టం మీద పార్టీని నడిపిస్తున్న విషయం తెలిపాడు ఆజాద్. అంతకు

ముందు విప్లవ సమితి కొన్ని కారును సైతం అమ్మినా అప్పుల్లో గడపవలసి వస్తుందతనికి.

తాను మొదటి నుంచి హి.సా.ప్ర. సేనకు అధ్యక్షుడు, సేనాని రెండు బాధ్యతలు నిర్వహిస్తున్నాడు. ఇప్పుడు అధ్యక్షపదవిని వదలుకొన్నాడు. అందుకు సేఠ్ దామోదర స్వరూప్‌ను ఎన్నుకున్నారు. అతడు కాకోరి రైలు దోపిడీలో ఆజాద్ సహచరుడు. అనారోగ్యంవల్ల ఇన్నాళ్ళు పార్టీకి దూరంగా ఉన్నాడు. ఆజాద్ కోరగా తిరిగి విప్లవరంగంలో ప్రవేశించడానికి వచ్చాడిప్పుడు.

ఆజాద్ కమాండ్ ఇన్ చీఫ్.

ఈ ఇద్దరికీ పర్సనల్ సెక్రెటరీగా, అనుసంధాన కర్తగా భగవతీచరణ్ బాధ్యత స్వీకరించాడు.

యశపాల్ పంజాబుకు, కైలాసపతి ఢిల్లీకి, వీరభద్ర తివారీ ఉత్తర ప్రదేశ్‌కు కార్యకర్తలయ్యారు. బెంగాళ్, మహారాష్ట్ర కార్యకర్తలు తమతో పొత్తు పెట్టుకుంటారని ఆశించారు. రాజస్థాన్, మధ్యప్రదేశ్, కాశ్మీర్ కార్యకర్తలకు కొత్త కార్యవర్గం గురించి పార్టీ కార్యక్రమం గురించి వివరాలను ఆదేశాలను పంపించారు.

ఇదే సమావేశంలో 'బాంబు దర్శనం' కరపత్రాలను పకడ్బందీగా దేశమంతటా ఒకేరోజు 26 జనవరినాడు పంపిణీచేసే కార్యక్రమానికి బాధ్యతను కార్యకర్తలు స్వీకరించారు.

ప్రజల సానుభూతిని ఆర్థిక సహాయ రూపంగా ఉపయోగించుకోవాలని, అత్యవసరమయితే ఒకటి రెండు దోపిడీలు చేయాలని నిర్ణయించారు.

అన్నింటి కంటె ముందుగా భగత్‌సింగ్, దత్తు తదితర బందీలైఉన్న క్రాంతికారులను విడిపించే కార్యక్రమంలో నిమగ్నులయినారు.



# భగవతీ చరణ్ మరణం

భగత్ వీరులు లాహోరు జైల్లోనే ఉన్నారు. వారి కేసు విచారణ సందర్భంలో ప్రజలు గుంపులు గుంపులుగా జైలుగేటువద్ద గుమికూడేవారు. నినాదాలు చేసేవారు. ప్రభుత్వం లక్షల డబ్బు వెచ్చించింది కూట న్యాయ నిర్ణయం నాటకానికి.

భగత్ వీరుల విప్లవ నినాదాలకు జనం జేజేలు పలికేవారు. వాళ్ళను అదుపులో పెట్టడం పోలీసులకు కష్టమయింది. ప్రజల ఆవేశం ఎటుపోయి ఎటు తిరుగుతుందో అని ఈతతంగాన్ని త్వరగా ముగించాలని ప్రభుత్వం నిర్ణయించింది. పొంగులెత్తే జనవాహినిని ఏ తుపాకులూ, చెరసాలలూ, శాసనాలూ ఆపలేవనే సత్యం వారికి తెల్సు.

అందుకే ఆ తొందర.

అవిధేయంగా మెదలుతూ కేసును పొడిగించ చూస్తున్నారనే కారణంగా భగత్ వీరులను నీచంగా అవమానించారు ఆ దుష్టులు. అయినా వీరి పట్టుదల వీరప్రవర్తనం మారలేదు.

భగత్‌ను విడిపించే కార్యక్రమంలో లాహోరు జైలుకు సమీపంలో ఓ కొత్త బంగ్లాను అద్దెకు తీసుకున్నారు. అందులో విప్లవకారులు ప్రవేశించారు. భగవతీచరణ్, ఆయన సోదరి సుశీలాదేవి ఇచ్చిన ఆరేడు వేలతోనే గుట్టుగా ఈ కార్యక్రమం నడిచిపోతున్నది.

ఆ ఇల్లు సంసారపక్షంగా కనిపించి పోలీసుల దృష్టినుంచి తప్పించుకోవటంకోసం స్త్రీల సహాయం అవసరమయిన దుర్గాదేవి, సుశీల వచ్చి చేరారు.

భగవతిభాయి ఎక్కువగా బయటనే గడుపుతూ అప్పుడప్పుడు ముఖ్యమైన సందర్భాలలో రహస్యంగా బంగ్లాకు వచ్చి గంటో అరగంటో గడిపి వెళ్తూ వుండేవాడు.





మొదట కోర్టుకు తీసుకు వెళ్తుండగా విప్లవఖైదీలను విడిపించాలనుకున్నారు. పిదప, సెంట్రల్ జైలు నుండి బ్రోస్టల్ జైలుకు మార్చే వేళలో భగత్ సహాగరులను జూన్ ఒకటి 1930 నాడు విడిపించాలని నిర్ణయించారు.

యశపాల్ రోహతక్‌లో సిద్ధపరచిన బాంబుల తయారీకి అవసరమైన మందును తెచ్చాడు. ఆజాద్ కాన్పూర్‌లో బాంబుల డిప్పల్ని పోతపోయించి తెచ్చాడు.

ధన్వంతరీ, బచ్చన్, సుఖదేవరాజ్, యశపాల్, బీహారీ అప్పుడు ఆమేడలో ఉంటున్నారు. కార్యక్రమ నిర్వహణకు రెండు దినాలు ముందుగా ఆజాద్‌వచ్చాడు. అతనికి ఈ 'యాక్షన్'లో తప్పకుండాపాల్గొనాలని ఉంది. యశపాల్, భగవతి చరణు ఇద్దరూ తాము తప్పక పాల్గొనాలని ఉబలాట పడుతున్నారు. ఆజాద్‌తోపాటు ఆ యిద్దరిలో ఒకరు పాల్గొనేవారు.

మే 28 నాడు భకవతీచరణ్ తనవెంట బచ్చన్, సుఖదేవరాజ్‌లను తీసుకొని బాంబు పరిశీలనకు రావినదీ తీరంలోని అడవికి వెళ్ళాడు.

ప్రయోగానికి ముందే బాంబు చేతిలో ప్రేలి ఘోరంగా గాయపడి చరణ్ అక్కడే పడిపోయాడు.

చరణు వెళ్ళే సమయంలో కారును పరిశీలించడానికి ఆజాద్ ధన్వంతరితో పాటు వెళ్ళాడు. ఇంట్లో లేడు.

సుఖదేవరాజ్ దెబ్బతిన్న కాలుతోపాటు వచ్చి తెల్పిన ప్రమాదవార్తకు యశపాల్, ఛైల్ బీహారీ పరుగెత్తు కెళ్ళారు. ప్రమాదకరంగా ఉంది భగవతి చరణు పరిస్థితి. అంతిమ దశలో చరణు పలికిన మాటలివి.

"మీరు వచ్చారా? భైయా అజాద్ కూడా వచ్చిఉంటే చూసేవాడిని."

ఈ మరణం మరో రెండు రోజుల తర్వాతవస్తే బాగుండేదని, భగత్‌ను తప్పక విడిపించండని చెప్పి ఆ వీరుడుకన్ను మూసాడు.



ఆ వార్త పిడుగు పాటు అయింది. అందరిలో దుఃఖం కట్టలు తెంచుకుంది. విషాదం అలుముకుంది. ఆజాద్ స్తబ్ధుడైనాడు. అతడే ధైర్యం వహించి మొదట తేరుకున్నాడు. తన విప్లవ పోరాట మార్గంలో ఇట్లాంటి చేదు అనుభవాల నెన్ని భరించలేదు. నడిచేది ముళ్ళబాట. సుఖాలు ఎక్కడి నుంచి వస్తాయి? కష్టాలు సహించకతప్పదు. లక్ష్య సాధనకోసం; ఉద్యమ నిర్వహణకోసం; దేశ విముక్తి కోసం.



తన విప్లవ సహచరుడు ప్రియమిత్రుడు భగవతి చరణు ఇక లేడు. అది తనకెంతో లోటు. అతని కుటుంబానికో? దుర్గాదేవితో ఆజాద్ అన్నాడిలా:

"నువ్వు మాకందరికి తల్లివి-సోదరివి. నువ్వు మాకోసం సర్వస్వాన్ని త్యాగం చేశావు. మేమందరం నీకు ఋణపడి వున్నాం. నీ విషయంలో మా కర్తవ్యాన్ని ఎన్నటికీ మరచిపోము." అంతకుమించిన కృతజ్ఞత ఓదార్పు ఏముంటుంది?

ఉదయం చీకటితోనే వెళ్ళి భగవతిచరణు శవాన్ని ఏమి చేయటానికీ వీలురేక అతి ప్రేమతో ప్రమాదం తెచ్చుకోలేక దుప్పటిలో మూటగా కట్టి రావీ జలాలలో వదలి వచ్చారు ఆజాద్, యశపాల్, బచ్చన్.

తన కుడి భుజం విరిగినట్లయింది చరణు మరణంతో ఆజాద్‌కు, అయినా కర్తవ్యాన్ని మరచిపోలేదు. కాని, తన ప్రయత్నంలో విజయంసాధించ లేకపోయాడు.

## విషాద సమయం

1930 అక్టోబర్ 7న. ప్రత్యేక కోర్టు భగత్‌సింగ్, సుఖదేవ్, రాజ గురులకు ఉరిశిక్షలు విధించింది.

విజయకుమార్‌సిన్హా, శివవర్మ, కిశోరీలాల్, జయదేవకపూర్, మహా దేవసింగ్, డాక్టర్ గయాప్రసాద్‌నిగం, కమలనాధతివారీలకు యావజ్జీవ కారాగార శిక్షలు ప్రకటించారు.

కుందన్‌లాల్‌కు ఏడేళ్ళు, ప్రేందత్తుకు ఐదేళ్ళు జైలుశిక్షలు పడ్డాయి. బటుకేశ్వరదత్తు ఏనాడో తప్పించుకొని పరారీ అయ్యాడు.

ఈ సమాచారం దేశాన్ని సంభ్రమపరచింది. ఆజాద్ హృదయాన్ని తీవ్రంగా గాయపరచింది.

ప్రభుత్వం ముమ్మరంగా అరెస్టులు చేస్తున్నది. బందీలైన విప్లవ కారుల్లో కొందరు పోలీసుల చిత్రహింసలకు తట్టుకోలేక పార్టీ రహస్యాలు వెల్లడి చేస్తున్నారు. దానితో ఉద్యమ నిర్వహణం కాదుకదా పార్టీ మనుగడకే సంకట పరిస్థితి ఏర్పడసాగింది.

ఆజాద్‌కు ఈ విషమపరిస్థితికి బాధ వేసింది. ఎంతో సాధించినా ఇంకెంతో సాధించవల్సిఉంది. అపజయాలు అసంతృప్తి, ఆవేదన కల్గిస్తున్నవి. ఉత్తరభారతం ప్రభుత్వం తీవ్రదృష్టిలో ఉంది.

ఆజాద్ కాన్‌పూర్ వెళ్ళాడు.

## అయినా ప్రయత్నం మానలేదు

మహారాష్ట్రకు పార్టీ కేంద్రస్థానాన్ని మార్చాలనే కోరిక భయ్యాకు కలిగింది. ధన్వంతరీని బొంబాయి పంపించాడు. 1915 కాలపు గదర్‌వీరుల్లో ఒకరైన పృథ్వీసింగ్ సహాయాన్ని అర్థించాడు. అతడు బలమైన వ్యక్తి-సాహసి.

పృథ్వీసింగ్ ఉత్సాహంతో వచ్చి ఆజాద్‌ను అలహాబాద్ ఆల్ఫ్రెడ్ పార్కులో కలుసుకున్నాడు. బొంబాయిని విప్లవ కేంద్రంగా మార్చుకోవాలనే మిత్రుని కోరికను అంగీకరించాడు. ఆవీరుల సాహసాలు పరస్పర సహకారాలు అటువంటివి. ధ్యేయం ఒక్కటే—

"దేశ హితంలో చావాలంటే వేలసార్లైనా సరే
అయినా కష్టమనే మాటే నా అంతర్యానికి రాబోదు
ఓ దేవా! నే భరత దేశమున నూరుసార్లు జన్మించాలి
దేశ ప్రయోజన కార్యములందే ప్రతిసారీ మరణించాలి."

—రాంప్రసాద్ బిస్మిల్.



# సంచలన పరిస్థితి

ఆజాద్ మనస్సు కల్లోలంలో పడింది. ఏమి చేసినా ప్రయోజనం కన్పించుతూ లేదు.

సుఖదేవ్‌రాజు మాటలవల్ల యశపాల్ ప్రకాశవతి అనే విప్లవసంఘ సభ్యురాలియెడల సరిగా ప్రవర్తిస్తూలేడని విని నమ్మి, అతనిని కాల్చడానికి ఒక కార్యకర్తకు ఆదేశించాడు. ఆ విషయం అదే మిత్రునిద్వారా తెల్సి యశపాల్‌వచ్చి దుర్గాదేవి చెప్పినందువల్ల తాను ప్రకాశవతి బాగోగుల విషయంలో శ్రద్ధ చూపవలసి వచ్చిందని వివరించాడు.

రహస్యం ముందుగా అతనికి ఎలా తెలిసిపోయిందనేది ఆజాద్ బాధ.

ప్రభుత్వ గూఢాచారి కావచ్చుననే అనుమానంతో వీరభద్ర తివారీని అంతం చేయాలని యశపాల్‌తోసహా ఎన్నోసార్లు ఆజాద్. విషయం ముందుగానే తెల్సి అతడూ తప్పించుకున్నాడు. ఇదంతా అగమ్యగోచరంగా ఉంది ఆజాద్‌కు. పైగా భగత్‌వీరులను ఖైదునుంచి విడిపించి శిక్ష తప్పించుతాననే ఆశ అడుగంటింది.

అన్ని ఏర్పాట్లు చక్కగా చేసుకొని వారిని విడిపించడానికి వెళ్ళిన రోజున ప్రయోజనం కన్పించలేదు. వారు విడుదలకాకపోగా మరికొందరు మిత్రులు బలిఅయ్యే ప్రమాదం కనిపించి తానే ముట్టడిని ఆపేసి తిరిగి వచ్చాడు.

ఈ అలజడితో నిస్సహాయుడైన చంద్రశేఖరఆజాద్ 4 సెప్టెంబర్ 1930నాడు ఢిల్లీ విప్లవసంస్థను రద్దుచేసాడు. కార్యకర్తలకు ఆయుధాలు కూడా పంచిఇచ్చాడు. అయితే అందరిపై అరెస్టు వారెంటులున్నవి! ఎవరెక్కడికిపోగలరు! వెళ్ళినా నెమ్మది పడేదెలా? మరోపనిలో లగ్నమయ్యేదెలా? అన్నింటని వదలి

విప్లవరంగంలో దూకినవారు, ఆశయం పూర్తికాంది ఎక్కడి సంతృప్తి. ముఖ్య కార్యకర్తలందరూ అప్పుడప్పుడు కలుసుకుంటూనే ఉన్నారు.

# గాంధీ-నెహ్రూలతో మంతనాలు

ఒక ముఖ్యమైన వార్త దుర్గాదేవికి చేరవచ్చింది. సుశీలతో ఆ విషయాన్ని ఆజాద్‌కు పంపించింది. అందుకోసం ఆమె ప్రయాగ వెళ్ళవల్సి వచ్చింది.

ప్రభుత్వం పేర్కొన్న నేరస్తుల్లో పరారీలో ఉన్నవారు పట్టుబడితే కేసును మరికొంతకాలం పొడిగించవచ్చును-అనేది ఆ వార్త సారాంశం. ఇది భగత్‌వీరుల కేసు ఫలితం ప్రకటించబడని కాలపు సంగతి.

అందుకు అంగీకరించలేదు ఆజాద్. కొండనాలికకు మందువేస్తే ఉన్ననాలుక ఊడింది-అనే సామెతగా తోచిందా విషయం. మిత్రులపై ఉన్న ప్రేమవల్లనే కాక ఉద్యమం ఆగిపోయే విధానాలేవీ ఆయనకు నచ్చేవికావు.

గాంధీజీకి ఒక వర్తమానం పంపించాడు దుర్గాసుశీలతో.

గాంధీజీ ఒకవేళ భగత్‌సింగ్, సుఖదేవ్ మొ॥ ఖైదీల శిక్షలు రద్దు పరచగలిగితే, తమపై నడుస్తున్న కేసులను ఉపసంహరింపగలిగితే, తమ ఉద్యమాన్ని విరమించి విప్లవసంస్థతో సహా గాంధీకి లోపడిపోగలనన్నాడు.

అంతటి ఆత్మవ్యధకు లోనైనాడు భయ్యా.

అయితే గాంధీజీ ఈ విషయంపై ఏ హామీ ఇవ్వలేదు. తాను రౌండ్ టేబిల్ సమావేశంలో ఈ విషయం ప్రస్తావించటం తగినదనుకోలేదు- ప్రస్తావించినా అంగీకరించబడుతుందనే విశ్వాసమూ లేదన్నాడు.

గాంధీజీ తప్ప అప్పటి కాంగ్రెసు ప్రముఖ నాయకులందరూ భగత్‌సింగ్

శిక్షను రద్దుపరచవలసిందిగా ప్రభుత్వాన్ని కోరినవారే. గాంధీజీ ఇర్విన్ చర్చల్లో ఈ విషయంలో ఏమి మాట్లాడిందీ తెలియదు. ఇతడడిగితే తర్వాత చూద్దామన్నాడట వైస్రాయి.

మోతీలాల్ నెహ్రూ, సుభాస్‌బాబు విప్లవకారులపై అభిమానంకలవారు. మోతీలాల్ మరణించాడు ఫిబ్రవరిలో.

జవహర్‌లాల్ సోషలిస్టు భావాల మనిషిగా ప్రచారం. 1929 డిసెంబర్ లాహోర్ సభల్లో కాంగ్రెసుఅధ్యక్షుడుగా ఎన్నికైనాడు కూడా. ప్రభుత్వంతో కాంగ్రెసు మంతనాలు బాగా జరుగుతున్నవి. అందుకని ఒకసారి ఆజాద్, నెహ్రూ దగ్గరికెళ్ళాడు మాట్లాడాలని. ఆ కలయికను నెహ్రూజీ ఇలా వ్రాసుకున్నాడు తన 'ఆత్మకథ'లో.

"కాంగ్రెసుకు బ్రిటిష్ ప్రభుత్వానికి మధ్య సయోధ్య కుదిరినట్లయితే, విప్లవకారులకు విముక్తి-ప్రశాంతి యేదైనా లభిస్తుందా? లేక, అప్పుడు కూడా ఇప్పటివలెనే విప్లవకారులను విద్రోహులుగా భావిస్తూ వెంబడించి వేటాడుతారా? వారి తలలు తెచ్చినవారికి ఇప్పటివలెనే బహుమతులు ప్రకటిస్తుంటారా? వారి కొరకు ఉరితాళ్ళే ఎదురుచూస్తుంటాయా లేక శాంతి కార్యక్రమాల్లో పాల్గొనే అవకాశం ఏదైనా ఉంటుందా? (అని అడిగి ఇంకా ఇలా అన్నాడు నెహ్రూ)

నాకు నా సహచరులకు దౌర్జన్యచర్యలపై విశ్వాసం లేచిపోయింది. దానితో ప్రయోజనంలేదు. అవును, (కాని అతడు శాంతి సాధనంగానే హిందూదేశానికి స్వతంత్రం వస్తుందని అంగీకరించలేదు. అతడన్నాడు) ముందు సాయుధ పోరాటపు అవకాశం వస్తుంది. కాని, వీటివల్ల కాదు. (నాకు ఆజాద్ నోటి నుంచి ఇదివిని చాల సంతోషమయింది. విప్లవ మార్గాలపై ప్రజల విశ్వాసం తొలగిపోయిందని అతనితో సాక్ష్యం లభించింది. అయితే ఆయనా, పూర్వపు దౌర్జన్యకారులు,

ఇంకా నూతన మిత్రులు అహింసామార్గంలో చేరుతామనిగాని, బ్రిటిష్ ప్రభుత్వ భక్తుల మౌతామనిగాని హామీ ఇవ్వలేరు. అపును, ఇప్పుడు వారు విప్లవకారుల రీతిలో ఆలోచిస్తూలేరు. వారిలో చాలమంది మనోవైఖరి ఫాసిస్టు పద్ధతిలో చేరి పోయిందని నాకు అనిపించింది.)"



తిరిగివచ్చి మిత్రులతో మాట్లాడుతూ "సాలా! నన్ను ఫాసిస్టు అన్నాడు" అని నొచ్చుకున్నాడు ఆజాద్.

రష్యా వెళ్ళటానికి సహాయం కోసం మరోసారి నెహ్రూదగ్గరికి యశపాల్‌ను పంపించాడు చంద్రశేఖర్.

అతడు జవహర్‌లాల్‌తో స్పష్టంగా చెప్పాడు- తమది "సాయుధపోరాటమే కాని బోల్షెవ్వవాదం కాదని, రష్యావెళ్ళి అక్కడి రాజకీయాలు పరిశీలించి రావటానికి డబ్బు సహాయం కావాలని.

"మీ అత్యాచారాలకు నేనేమీ సహాయం చేయలేను. కాని, రష్యాకు వెళ్ళే విషయంలో ఆలోచిస్తాను" అని నెహ్రూ ఆ తర్వాత 1500రూ॥ ఇచ్చాడు యశపాల్‌కు.

26 ఫిబ్రవరినాడు నెహ్రూ ఇచ్చిన డబ్బు ఆజాద్‌కివ్వబోయాడు యశపాల్. ఆ మొత్తాన్ని ఇతన్నే ఉంచుకొమ్మన్నాడతడు. వేయి రూపాయలు తానుంచుకొని బలవంతంగా నాయకుని పాకెట్‌లో అయిదువందలుంచాడు.

ఆజాద్‌నే రష్యా వెళ్ళమన్నాడు మొదట యశపాల్. అందుకతడన్న మాటలు "నేను రష్యా గిష్యా ఎటూపోను. నా దేశం స్వాతంత్ర్య పోరాటంలో ఉంది. ఇటువంటి సమయంలో దేశాన్ని విడిచి దూరంపోతే, అది యుద్ధరంగంలో వీపుచూపి వెనుకంజ వేయటంతో సమానమే. నా అవసరం ఈ దేశంలోనే ఉంది. నేను నా చివరిశ్వాస వదిలేవరకు ఇక్కడే ఉండి శత్రువులతో పోరాడుతుంటాను." అదీ అతని ధ్యేయం.

అయితే అంతకు పూర్వం వినాయక సావర్కార్, మేడంకామా, గదర్ వీరులు, ఉద్ధంసింగ్, ఎం.ఎన్.రాయ్, జితేంద్రనాథ్ ముఖర్జీ ఆ తర్వాత కూడా ఎందరో విదేశాల నుండి ఉద్యమం నడిపినవారే. కాని ఆజాద్‌కది నచ్చలేదు.

శత్రువుల తుపాకి గుళ్ళకు ఎదురునిల్చేదము.

హంతకుల భుజాల్లో బలమెంత ఉందో చూడాలి. అనే ధోరణి అతనిది.



# మాట చెల్లించుకున్న వీరయోధుడు

ఒకసారి విప్లవకారులు తమకు ప్రభుత్వం సంకెళ్ళు వేయడం ఖాయమని ముచ్చట్లాడుతూ ఆజాద్‌భైయాకైతే పెద్ద సంకెల (బేడీ) ప్రత్యేకంగా చేయించవల్సి ఉంటుందన్నారు నవ్వుతూ, అతనిచేయి మందంగా ఉందని.

అప్పుడు ఉద్రేకంతో నిండిన ఆజాదిలాగన్నాడు.

"ఆజాద్ చేతికి సంకెళ్ళు వేయడం ఇంక ఎంతమాత్రం సాధ్యంకాదు. ఒకేఒక్కసారి ప్రభుత్వం ఆపని చేయగలిగింది. అంతే! ఇక శరీరం ముక్కలు ముక్కలయిపోతుంది కాని, పోలీసులు నన్ను బంధించలేరు.

బందీనై చేతులుకట్టుకొని కోర్టులో నిలబడడం నావల్లకాదు. ఉరిత్రాటికి వ్రేలాడాలనే కోరిక నాకులేదు.

నాచేతిలో పిస్తోలుంది. దీనిలో ఎనిమిది గుళ్ళున్నాయి. మరో ఎనిమిది హారాల మాగజీనుంది. పదిహేనుగురిని శత్రువులను హతమారుస్తాను. పదహారవది ఇక్కడ..." అని తన కణతను చూపెట్టాడు.

అది కొన్నేండ్లక్రితపు ముచ్చట.

ఆనాడు 27 ఫిబ్రవరి 1931. శుక్రవారం ఉదయం నీరెండకాస్తూ ఆహ్లాదకరంగా ఉంది ప్రకృతి, పసిపిల్లల మనస్సులా. ప్రభుత్వం రాతి తలలు మాత్రం మండిపోతున్నయ్ అగ్నిపర్వతంగుండెల్లా.

యశపాల్ రష్యా ప్రయాణానికి కావల్సిన అత్యవసర వస్తువులు కొనడానికి బజారు బయల్దేరుతున్నాడు సురేంద్రపాండేతో సహా.



"నేను ఆల్ఫ్రెడ్ పార్కులో ఒక వ్యక్తిని కల్సుకోవాలి. పదండి కలిసేపోదాం" అని ఆజాద్ కూడా బయల్దేరాడు. ముగ్గురూ సైకిళ్ళపై స్వారి సాగించారు. ఆల్ఫ్రెడ్ పార్కుముందుగా సుఖదేవ్‌రాజ్ మరో సైకిల్‌పై వస్తూ కన్పించాడు.

"అచ్చా! మీరికపొండి" అని ఆజాద్ తనబైస్కిల్ పార్కువైపు తిప్పాడు. మిగతా ఇద్దరు ముందుకు వెళ్ళారు.

మిత్రునితో మాట్లాడుతూ ఓ చెట్టువారగా కూర్చున్నాడు ఆజాద్. రోడ్డుమీదుగా వీరభద్రతివారి వెళుతున్నట్టుగా అనిపించింది. దూరం కాబట్టి పిలవలేదు.

వారు ముచ్చట్లలో ఉండగానే పోలీసులు చుట్టుముట్టారు. ఎలాంటి హెచ్చరిక లేకుండా కాల్పులు ఆరంభించారు.

ఆజాద్ పిస్తోల్ కోసం ప్రక్కజేబులో చేయిపెట్టగానే ఒక ప్రక్క నుండి గోలీ దూసుకువచ్చి అతని కాలిపిక్కను విరిచింది. మరొకటి అతని ఛాతీని ఛేదించుకొని వెళ్ళి ఊపిరితిత్తిలో దూరబడింది. పరిస్థితి విషమించడం గమనించాడు.

"నిన్ను నువ్వు రక్షించుకో. నేను వీరితో పోట్లాడుతాను." అని సుఖదేవరాజ్‌ను బలవంతంగా అక్కడి నుంచి పంపించాడు. అతడు తోటగేటు దాటేవరకు చూసి, ఆతర్వాత ఆవేశంతో నిండిపోయాడు ఆజాద్.

అతని శరీరం నెత్తురుతో నిండిపోసాగింది. ఆ దగ్గరి చింతచెట్టును చాటుచేసుకొని నిలిచాడు.

ధన్! పిస్తోలు గర్జించింది.

పోలీసాఫీసర్ కారుటైర్ పంక్చరయింది.

ధన్!! రెండవ దెబ్బ. ఆజాద్‌ను కాల్చడానికి పిస్తోల్ ఎత్తిపట్టిన ఎస్.పి. నాట్‌బాబర్ చేయిచూర్ణమైంది. మూడవదెబ్బతో అతని కారు ఇంజన్ బ్రద్దలయింది.

భయంతో ఆ పోలీసాఫీసర్ పరుగెత్తి ఓ చెట్టు చాటున దాక్కున్నాడు.

గుండ్లు చుట్టు వర్షిస్తున్నా ఈ వీరయువకుడు మెరుపువలె కదలి మరో చెట్టునాశ్రయించాడు. అతని దృష్టి నాట్‌బాబర్‌పై ఉంది. గర్జించాడు సింగంలా.

"ఓ బ్రిటిష్ సామ్రాజ్య ప్రతినిధీ! భారత విప్లవవీరుల ముందు భయపడి నక్కవలె ఎందుకు దాగిఉంటావ్! ముందుకురా."

అతడు రాలేదు. కాని, చుట్టూ కాల్పులు హెచ్చినై. చుట్టూ ఒకసారి చూసి ప్రేమ వారి ఉట్టిపడగా అన్నాడు ఆజాద్-

"ఓ నా భారత సిపాయిలారా! ఎందుకని నామీద మీరు విపరీతంగా గుండ్లవర్షం కురిపిస్తున్నారు. నేను మీ స్వేచ్ఛకోసమే పోరాటం సాగిస్తున్నాను. నన్ను మీరు అర్థం చేసుకుంటే మంచిదే. లేక ఆలోచన లేకుండా మీరు నాపై కాల్పులు సాగించినా నేను మాత్రం మిమ్ము చంపను."

ఆడినమాట నిలుపుకున్నాడు కూడా.

కుడివైపు అలికిడి వినిపించి అటు చూశాడు. తన శరీరాన్ని గాయపరచిన ఎస్.ఐ. విశ్వేశ్వరసింగ్ తిడుతూ కనిపించాడు.

"అచ్ఛా! అనుభవించు బదలా" ట్రిగ్గర్ నొక్కాడు. సింగు నాలిక ముక్కలై తలపగిలి రక్తం కక్కుతూ కూలాడు.

మళ్ళీ మీట నొక్కాడు. చెట్టు చాటునుంచి తొంగిచూస్తున్న నాట్ బాబర్ సఫా!

ఏరి ఏరి గురిచూసి కాల్చే అతని ప్రతిభకు శత్రువులే 'వహ్వా' అని ప్రశంసించారు.



సత్తువనంతా కూడదీసుకొని పోరాడుతున్నాడు ఆజాద్. ఒక్క దెబ్బనూ వ్యర్థం కానీయలేదు. చివరికి ఒకేఒక్క గోలీ మిగిలివుండడం గమనించి, తన కణతలో కాల్చుకొని మాతృభూమి ఒడిలో పడిపోయాడు. ఆ వీరుడు అంతటి భయానక పరిస్థితిలోనూ తన ప్రతిన చెల్లించుకున్నాడు. ఆజాద్ నిజంగా స్వతంత్రుడు! స్వేచ్ఛగా జీవించి స్వేచ్ఛగా మరణించి ఆజాద్‌ననిపించు కున్నాడు.

రోడ్డుపై జనం ఆగింది. పెరిగింది. తోటచుట్టూ మూగింది. గుసగుసలు ఏమిటి? ఎవరు? ప్రఖ్యాత విప్లవవీరుడు చంద్రశేఖర ఆజాద్! ఆజాద్ అమరుడు!!

కొన్ని క్షణాల క్రితం ఆంగ్లప్రభుత్వ రక్షకభట సిబ్బందిని కల్లోల పర చిన అగ్నిపర్వతం అక్కడ నిశ్చలంగా పడివుంది.

ఏ వీరుడు ఎనిమిదేండ్లుగా ప్రభుత్వ శిక్షలను తప్పించుకొని తిరుగుతూ ఉద్యమాలు సాగిస్తున్నాడో, ఏ ధీరుడు ప్రముఖ పోలీసాఫీసర్లను పట్టీలు కొట్టించాడో, ఏ శూరుని పేరు చెప్పితే శత్రువులకు గుండెలు బేజారై నుదుళ్ళకు చెమటలు పట్టేవో, ఆ విప్లవ సింహం ధరాతలంపై శాశ్వత నిద్రలో—

అతని చుట్టూ భారత జనం, వారి కళ్ళల్లో కృతజ్ఞతాపూర్వక బాష్ప జలం, కాని, వాళ్ళు భయంతో జనం చచ్చిన వాళ్ళు, అయినా అంతరంగాల్లో ఆవేశం ఎగసిపడుతున్న సెగళ్ళు.

ఆ క్రాంతియోధుని వదనంలో నిర్వికార నిశ్చల సజీవకళ! అదే దీప్తి! అదే శక్తి—నిర్భీతి.

భయంతో బిక్కుబిక్కుమంటూ ఆ మృత వీరుని బెదరుతూ సమీపించారు పోలీసులు. మృతుడని విశ్వసించక ఒక బంట్రోతు అతని తల వెంట్రుకలు పట్టి ఊపి చావు ధైర్యాన్ని పొందాడు. అప్పుడు లాక్కువెళ్ళి పోలీసు ట్రక్కుపై వేసుకొని జనం కళ్ళలో దుమ్ముచల్లుతూ వెళ్ళారు.

ఆ వీరుడు పడిఉన్న నేల సింధూర వర్ణంలా మెరుస్తున్నది. చుట్టూరా చెదరి పడివున్న జంబూ పత్రాలు రక్తసిక్తమై మంకెన పూరేకుల్లా అంగారకణికెల్లా భాసిస్తున్నవి. రక్తాక్షరాల అమరవీరగాధను తలపిస్తున్నవి.

"నేను ఈ పోరాటంలో ఆహుతి అయిపోయినా రానున్న కాలంలో మీరనుభవించే ఆనందాల్లో సుఖసౌభాగ్యాల్లో నాకూ భాగముంటుంది. మేమంతా మా ప్రాణాల్ని అందుకోసమే బలిపెట్టాము. ఇప్పుడు మిమ్మ విడిచిపెట్టి వెళ్ళడం ఎంత బాధగా వున్నా, రేపటి మీ ఆనందాలను తలచుకొన్నప్పుడు అంతకన్నా ఎక్కువ ఆనందపరవశున్నవుతున్నాను," — జ్యూలియస్ ఫూజిక్.

జెకోస్లేవేకియా

ఆవీరుని చూడటానికి జనం తొక్కిసలాడారు. అతడు పడివుండిన నేలను ముద్దిడుకున్నారు. వీరరక్తంతో తడిసిన ఆ మట్టిని తిలకాలు దిద్దు

కున్నారు. హృదయ విదారకంగా శోకించారు. కమలానెహ్రూ, ఇతర కాంగ్రెసు ఇతర క్రాంతి కార్యకర్తల ప్రయత్నంతో ఆజాద్ శవాన్ని తెచ్చి గంగాతీరంలో సగౌరవంగా దహనం చేశారు. ప్రజలు ఆ వీరుని చితాభస్మాన్ని తిలకాలుగా ధరించారు.



ఆజాద్‌కు చివరికాలంలో ఆశ్రయమిచ్చిన వీరపత్ని లక్ష్మి ముసలమ్మ ఆజాద్ అమరుడైనచోట చిన్నగుడికట్టి దినం దీపం పెట్టి మొక్కింది. అక్కడి

చింతచెట్టూ పూజలందుకుంది. ప్రభుత్వం దాన్ని కొట్టి వేయించింది. ఒక నూత్న వ్యక్తిని ఆజాద్ అన్నగా పరిచయంచేసి కష్టంగా శవాన్ని కస్టడీ నుంచి తేగలిగారు.

# ఒక్క క్షణం ఆజాద్ స్మృతిలో

ఎవరో నమ్మక ద్రోహం చేశారు. అలా కాంది ఎకాయెకి అంత పకడ్బందీగా పోలీసులు చుట్టుముట్టలేరు అనేది ఒక అనుమానం. సుఖదేవ్ రాజ్, సురేంద్రపాండే, వీరభద్ర తివారీ, యశపాల్ ఎవరైనా కావచ్చును ఆ మిత్రదోహులు. దానిమీద చర్చలు బాగా నడిచినై. ఎటూ తేలలేదు. దేశభక్తులకు దేశద్రోహం అంటకట్టేకంటే అది అలా యాదృచ్ఛికంగా జరిగింది అని అనుకోవడమే భావ్యం.

ఆజాద్‌తో భగత్‌సింగ్ అన్నాడో మారిలా —

"పండిత్‌జీ! ఇంతకూ మీ ఇల్లెక్కడ? మీ బంధువులెవరో తెలపండి. భవిష్యత్తులో అవసరమైతే వారికి మా సహాయం అందించే వీలుంటుంది. పైగా ఈ దేశవాసులకు ఒక నిజమైన వీరుని విలాసమయినా తెలిసి వుంటుంది."

అందుకు ఇలాగుంది భైయా జవాబు.

"చరిత్రలో నా పేరు రాయించుకోవాలని లేదు. నా బంధువులకు ఎవరి సహాయమూ అవసరములేదు."

ఉన్నత కార్యనిర్వాహకుడైనా కీర్తికాంక్షలేదు. పేదరికంలో పుట్టి పెరిగినా డబ్బు కక్కుర్తిలేదు. అతడు నిస్వార్థజీవి.

ఆజాద్ ఇంటి పరిస్థితి తెల్సుకొని మిత్రులు కొంత డబ్బు అతని తల్లిదండ్రికి పంపాలని చూశారు. అది తెల్సి వారించి, వారిని కోపించి అన్నాడిలా—

"నా తల్లిదండ్రి కోసం నేను బిచ్చమెత్తాలా యేం?

ఈ రూపాయలు నా ప్రాణాలతో చెలగాటమాడి తెస్తున్నాను. వీటిని మా వాళ్ళకిస్తే ఎవరూ నన్నేమనక పోవచ్చు. కాని అలా చేయలేను. ఈ డబ్బు కేవలం మాతృభూమి సేవకొరకు ఉద్దేశింపబడింది. తల్లిదండ్రి [illegible] ఉంచుకోవాలంటే నావల్ల కాదు. ఒక వేళ వాళ్ళు కష్టంలో ఉన్నట్టు [illegible] కన్నా నా పిస్తోలులోని రెండు గుండ్లు వారి సేవకోసం సరిపోతాయి. నేనువారికి ఈ సేవే చేయగలను. నా తల్లిదండ్రుల విషయంలో కాపీ, లేదా [illegible]

కానీ, ఎవరినుంచి కానీ, ఎవరూ ఎలాంటిలాభం పొందే ప్రయత్నం చేయకండి."

ఇంకా అన్నాడిలా-

"వారికి ఇతరుల సహాయం అవసరమేమొచ్చింది. ఈ బానిస దేశంలో లక్షల కుటుంబాలు ఒక్కపూట తిండికి కూడా నోచుకోని వారున్నారు. నా కన్న వాళ్ళు కనీసం రెండు రోజుల కొకసారయినా ఆహారాన్ని సమకూర్చుకోగల స్థితిలో ఉన్నారు. వాళ్ళు ఆకలితోనైనా గడుపగలరు. కానీ, ఈ డబ్బు వాళ్ళకిచ్చి పార్టీ వ్యక్తులను ఆకలితో మరణింపనీయను. వీళ్ళ అవసరాలను తీర్చడం నా ప్రథమ కర్తవ్యం. నా తల్లిదండ్రులు మరణించినా దేశానికేం నష్టం కలగదు. దేశంలో ఎందరో అట్లా చస్తూ బతుకుతూనే వున్నారు."

ఇదీ ఆయన చిత్తవైఖరి. ఇంటి కంటె దేశం, వ్యక్తికంటె సంస్థ గొప్పవనే భావం.

తల్లిదండ్రులపై ప్రేమలేని కఠినుడు, అందామంటే ఒకసారి వైశం పాయన బచ్చన్‌ను ఆర్ద్రంగా ఇలా కోరాడు. "బచ్చన్! అవకాశం దొరికి నప్పుడు ఒకసారి నువ్వు 'బాంవరా'కు వెళ్ళి మా అమ్మను తప్పక కలుసు కోవాలి సుమా!"

ఆ మాట ప్రకారం ఢిల్లీ ఆరెస్టునుంచి విడుదల పొందగానే బచ్చన్

ఆ వూరికి వెళ్ళి, కొడుకు రాకకోసం వేయి కళ్ళతో ఎదురు చూస్తూ మంచాన లేవలేక పడివున్న వృద్ధమాతను చూశాడు.

పుత్రుని వీరమరణ వార్త చెప్పితే మొదట ఆమె నమ్మలేగు. తన కొడుకు అమాయకుడు అంతటి గొప్ప నై ఎట్లా పోరాడుతాడని సందేహం. పిదప ముఖంలో కాంతి నింపుకొని ఆనందంతో నా కడుపు ధన్యమైంది. నా కొడుకు మరణీ వీరమాత జగరాణీదేవి.

ఆజాద్ మనోనిగ్రహం గొప్పది. విప్లవకారులకు బ్రహ్మచర్యం తప్పనిసరి అనేవాడు. ప్రమాదకరమైన ఈ జీవితంలో మరో వ్యక్తిని బాధపెట్టడం తగదని అతని భావన. సంసార వ్యామోహంలో పడి ఉద్యమాన్ని అశ్రద్ధ చేస్తారనీ అనుమానం. కాని ఆ తర్వాత భగవతీచరణ్ భార్యదుర్గాదేవి, యశపాల్ సహచరి ప్రకాశవతి... తోడ్పాటు చూసి ఆయన అభిప్రాయం మారింది.

యశపాల్‌తో అన్నాడోమారు చివరి దినాల్లో-

"ఈ విప్లవం జీవితాంతం ఆచరించదగిన వ్రతం అయినప్పుడు తగిన ఆదర్శవంతురాలు, విప్లవకారిణి లభిస్తే వివాహమాడడం మంచిపని—నేను ఇటువంటి స్త్రీని పెళ్ళి చేసుకుంటానుకదా...(ఆంగ్లప్రభుత్వానికి) కాంగ్రెసువారికి రాజీ

కుదిరినా, మేం సరిహద్దు ప్రాంతానికి వెళ్ళిపోతాం. ఆమె రైఫిల్స్ నింపి ఇస్తూనే ఉంటుంది. నేను దనాధన్ కాలుస్తూనే ఉంటాను. బస్! అలాగే సమాప్తమయిపోవాలి."

ఆంగ్లేయుల కౌరిన్యాన్ని, కాంగ్రెసు చేత కాని తనాన్ని అంతగా ద్వేషించాడు ఆజాద్.

స్వతంత్ర భారతంలో ఒక వీరపత్ని లక్ష్మి ముసలమ్మ ఇలా అరుస్తూ తిరిగింది అలహాబాద్ వీధుల్లో కొన్నాళ్ళు.



"ఒరే మూర్ఖులారా ! అమర వీరుల చితులపై ప్రతి యేట కాదు, ప్రతిరోజు పండగ జరపాలిరా. ప్రతిదినం ఉత్సవం జరిపినా వారి ఉపకారానికి రుణం తీర్చుకోలేరు మీరు. ఈ కాంగ్రెసు ప్రభుత్వం బుద్ధి పాతయింది. ఈ నేల భయ్యా ఆజాద్ రక్తంతో తడిసింది. ఇది ఆయన బలి దానమయిన పవిత్ర స్థలం. కాని దీనిపేరు ఆల్‌ఫ్రెడ్‌పార్క్ ? సిగ్గు మాలిన వాళ్ళారా ! దీన్ని 'ఆజాద్ పార్క్' అనే ధైర్యం మీకెప్పుడు వస్తుంది."

"ఏ దేశం (స్వతంత్రత) చరిత్రను కోల్పోతుందో ఆ దేశం స్వాతంత్ర్యాన్ని కోల్పోతుందని ఆజాద్ స్వయంగా అనేవాడు." —వైశంపాయన్.

ఆజాద్ ఆశయం "మనకు సరిహద్దులుగా బర్మా మరియు నేపాల్ నుంచీ కరాచీ వరకు భారత భూభాగమంతా కలిపి ఒక బలమయిన ప్రభుత్వాన్ని రూపొందించాలి. ఎప్పుడైతే ఈ ఫిరంగీలు పరుగెత్తి పోతారో అప్పుడు ప్రతి వ్యక్తీ ఆనందప్రదంగా జీవించగల సమయం వస్తుంది."

ఆజాద్‌కు ప్రియమైన పాట—బాట :

శత్రువుల తుపాకిగుళ్ళకు ఎదురు నిల్చెదము.

స్వేచ్ఛగా ఉంటాము మేము స్వేచ్ఛగా ఉంటాం.

— సమాప్తం —